# భూగ్రహము.

(డిటెక్టివు నవల)

ద్విభాష్యం వెంకటరమణయ్యగారు



వాణీగ్రంథమాల

రాజమహేంద్రవరము.

వెల 1-0-0

# తొలిపలుకు

పాఠక మహాశయులారా!

నేను సంస్కృతాంధ్ర భాషాపరిచితి లేనివాడగుటచే తను నవలారచన కిదియే ప్రథమ మగుటచేతను నిందుఁ దత్సంబంధములగు తప్పులు మెండుగ గానుపింపవచ్చును, పాఠకులవి గ్రహించి నాకు తెలియపరచినచో పునర్ముద్రణమునందు సవరించుకొనుచున్నాడను.

ఆంధ్రభాషానురాగమున గ్రంథమాలను నెలకొల్పి భాషాసేవ చేయుచున్న "వాణీగ్రంథమాల" వారు దయతో నీపొత్తము నచ్చొత్తింప స్వీకరించిరి. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనశతంబుల నర్పించుచు, భగవంతుఁడు గ్రంథమాలకు చిరాయుస్సు నొసంగుగాక! యని కోరుచున్నాడను.

భాషాతత్పరులగు పాఠకమహాశయులు చందాదారులుగాచేరి ఆంధ్రభాషాభివృద్ధికి తోడ్పడెదరుగాక!

ఇట్లు,

దుగ్గాడ్, ద్విభాష్యం వెంకటరమణయ్య,

6—11—1933. గ్రంథకర్త.

## — కృతి —

సీ॥ పరుల పాపల దన ॱ పాపల నొకరీతి
సమబుద్ధితోఁ బెంచు ॱ సచ్చరిత్ర
స్వప్నంబునను హరి ॱ స్మరణమానకయుండు
శక్తిగల్గినయట్టి ॱ భక్తురాలు
బ్రహ్మస్వరూపమీ ॱ బ్రహ్మాండములటంచు
మదినిశ్చయించిన ॱ మాన్యురాలు
ఇతరులచిత్తంబు ॱ నెపుడైననొవ్వక
యుండమాటాడెడి ॱ యోగ్యురాలు

గీ॥ బ్రహ్మరమణాంబికాపుత్రి ॱ భవ్యకీర్తి
ధర్మపథవర్తి కామరా ॱ ద్ధర్మబత్ని
యైన నాతల్లి శ్రీ పేర ॱ మాంబ పేర
నీకృతి నొసంగినాడ క ॱ వీంద్రులార!



౧

## చోరి.

అది వేసవికాల ప్రారంభము. నాఁడు ఫాల్గుణబహుళ త్రయోదశి. చంద్రోదయం బప్పుడే యయియుండుటచే రమారమి నాల్గుగంటలు కావచ్చెను. మలయమారుతము చల్లగ వీచుచుండెను. పక్షులు సమీపం బగుటచేఁగాబోలు బడి విద్యార్థులందరు లేచి తమతమ పాఠంబుల జదువుకొను చుండిరి. పోలీసువారు నిద్రాదేవతకుఁ దాసోసంగముండిరి. అట్టితరి నొకయింటిలో నెద్దియో పెద్దగోల వినబడుచుండెను. పోలీసు వారాకేకల కులికిపడి లేచి బిగ్గఱవైచుచు నాగోల వైపే పర్విడుచుండిరి చదువుకొనుచున్న విద్యార్థులు తమ పాఠంబుల నటనేవిడిచి యావైపే పర్వెత్తుచుండిరి. రక్షకభటులను 'ఏమిజరిగినది! ఏమిజరిగినది!' అనుచు పరుగెత్తు చుండిరి వారుకొద్దిదూరమేగి చూచునప్పటికి నొకచోజనులు పెద్దమూకగాఁ జేరిరి. వారందరినడుమ నొకవృద్ధుడు గోలున నేడ్చుచుండెను. రక్షకభటులు 'దారి తొలఁగుడ' నుచు కేకలువైచుచు నావృద్ధుని యొద్దకువచ్చి 'అయ్యా, ఎందుల కేడ్చుచుంటిరి?' అని యడిగిరి.

వృద్ధు—చోరీ! చోరీ!! అని చెప్పి మరింత గట్టిగ నేడ్వ జొచ్చెను.

రక్ష—చోరీయా! ఏమి పోయినవి?

వృద్ధు—నానోటితోఁ జెప్పజాలను. చెప్పినగుండె బ్రద్దలగును. బాబూ! మీతోఁ జెప్పక తప్పదు. సుమారు నాల్గులక్షల రూపాయిలు ద్రవ్యము పోయినది.

రక్ష—అయ్యా, వగవకుడు. మాసర్కిల్ యినస్పెక్టరు గారు తగిన యాచోకీ తీయుదురు. ఆయనకు వర్తమానింపెద భయపడకుడు. అని చెప్పి యొక రక్షభటుని ఇన్స్పెక్టరు గారి కొరకుఁబంపెను.

అటనున్న పురస్త్రీలు "పాపము! ఎంతగా నేడ్చుచుండె నమ్మా! ఏడ్పుచూచిన మనకే గుండె బ్రద్దలగుచున్నది. ఎంతటి చోరుడో!" అనియు, పిల్లికి బిచ్చమైనఁబెట్టను ఉట్టివానిగతి మరేమి యగుననియు, "ఈయనకొక యమ్మాయి యుండె నమ్మా! ఆమెకుఁబెండ్లిచేసి యల్లుని యిల్లరిక ముంచుకొందు ననుకొనెడివాడు. పాపము! ఇక ఇల్లరికము న కేరుపత్తుర" నియును పలువురు పలువిధంబులు గుసగుసలాడ జొచ్చిరి ఇంతలో రమారమి ముప్పదివత్సరములు ప్రాయముగల యువకుఁడొకడు మల్లుపంచను గట్టుకొని పోలోకాలరు కాకిట్వీల్ చొక్కాను దొడగికొని పైనొక తువాలును వేసికొని యటకువచ్చెను, ఆయువకునిఁ జూడగానే యందరును దారి తొలగిరి, అంత నాయువకుఁడేడ్చుచున్న వృద్ధునిజూచి "అదేమండీ! సెట్టిగారూ, అట్లువగచుచుండిరి" వి యడిగి సంగతి తెలిసికొని యాతనితో నిట్లనియెను,

సెట్టిగారూ! ఊరకుండుడు! బాలురవలె నేడ్చిన ప్రయోజనమేమి! నేను కొన్ని ప్రశ్న లడిగెదను. సదుత్తరములిండని యాతని నూరడించి పురజనులకు బొమ్మని యాతనితో బంగారుసెట్టిగారి యింటిలోని యొకగదిలోనికి బోయెను.

యువ—సెట్టిగారూ, నేనడిగిన ప్రశ్నలకు సదుత్తరము లిచ్చెదరా?

సెట్టి—తప్పక యిత్తును. మీకుగాక మరెవ్వరికిత్తును.

యువ—ఎంతసొమ్ము పోయినది.

సెట్టి—నాల్గులక్షల రూపాయలు.

యువ—పోయిన దంతయు రొక్కమేనా!

సెట్టి—చిట్టాచూచి చెప్పెదనండి.

యువ—కన్న మెక్కడనైన నున్నదా?

సెట్టి—చూడ లేదండి.

యువకుడు సెట్టిగారు చెప్పినమాటలన్నియు దేనిమీదనో నోటుచేసికొనుచుండెను పిమ్మటనాతడు 'బంగారుసెట్టిగారూ! చోరీజరిగిన స్థలమొకసారి చూతము వచ్చెదరా? అని యడిగెను సెట్టిగారు 'చిత్తమ'ని చెప్పి యువకుని మేడపైకి తన దిరయొద్దకుఁ దీసికొనివెళ్ళెను.

ఆగదిలో నొక తెరచిన యినపపెట్టెయును, సెట్టిగారి మంచమును దానిప్రక్కనిద్దరు స్త్రీలును ఉండిరి. యువకుడు నాల్గుమూలలను పరికించి చూచెను. ఇనుపపెట్టెకు రెండడుగుల దూరమున నొకమనుష్యుడు దూరగల్గునంతటి

కన్నము మాత్రము త్రవ్వబడియుండెను. అదిచూచి యాతఁడు "అయ్యా! ఇదిగోనండి. ఇక్కడనొక కన్నమున్నది" అనెను.

సెట్టి—చిత్తము.

యువ-ఇనుప పెట్టె తాళపుచెవు లెవరియొద్దనున్నవండి.

సెట్టి—నాయొద్దనేయున్నవండి. అని చెప్పి తాళములను దీసి చూపించెను.

యువ—తమ రెచ్చట పరుండిరి.

సెట్టి—ఇచ్చటనే, ఈమంచముపై.

యువ—ఆయువతు లెవ్వరు.

సెట్టి—ఈమె నాకొమరిత రాజేశ్వరి. ఈ రెండవ యామె దీని నూరడించవచ్చిన పొరుగావిడ.

యువ—ఈమె యెచ్చట పరుండెను?

సెట్టి—దీనికెదురుగనున్న గదిలో.

యువ—అమ్మా! రాజేశ్వరి! రాత్రి నీకేమియు చప్పుడైనట్లు తెలియలేదా.

రాజేశ్వరి—అయ్యా! రాత్రి ఒకటిరెండు గంటల మధ్యనేదోధ్వనియైనది. కాని మాతండ్రికి రాత్రియే ధనము లెక్కించుకొనుయలవాటగుటచే నాతడే శాబోలనియూరకుంటిని.

యువ—అయినచో చోరీ ఒకటిరెండు గంటలమధ్య జరిగియుండునవనితోచెడిని.

సెట్టి—చిత్తము

యువ — అయ్యా! చిట్టాచూచి సరిగపోయినదెంతయో చెప్పండి.

సెట్టి 'చిత్తమని' చెప్పి తన మంచముపెట్టెయందున్న చిట్టానుదీసి యిట్లుచెప్పెను. రమారమి మూడులక్షల విలువగల ప్రోనోట్లు, దస్తావేజులు మున్నగుపత్రములు, జవహారి (నగలు) రు 60000. కర్రెన్సీనోట్లు రు 49000. రొక్కము రు 936-14-6.

యువకుడు వీనినన్నిటిని నోటుచేసికొని సాధ్యమైనంత వరకు గట్టిప్రయత్నము చేసెదలెండు. అనిపోవుచుండగా నాతనిదృష్టి దేనిపైననో బడుటచే గిరుక్కున వెనుకకుదిరిగి యినుపపెట్టెలోనున్న యొకకాగితమునుదీసికొని మేడదిగెను. సెట్టిగారును ఆయనను వెంబడించిరి. ఇరువురును క్రిందిహాలు నకుబోయి దొరకిన యాకాగితమునువిప్పిరి. అదియొకలేఖ. దానినిట్లు చదివిరి.

మహారాజశ్రీ పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టరుగారగు రామచంద్రుగార్కి —

తమ శ్రేయోభిలాషి కృతానేక వందనశతంబులు.

అయ్యా!

తమ కీచోరీసంగతి తెలియజేతురనియుఁ దమరువత్తురనియు యెరింగియే యీయుత్తరమిందుంచితిని, మీశ్రేయో భిలాషినయిన నేను మీకువిశదపఱచునదేమన తమరీకేసులో

జోక్యముఁ గలుగజేసికొనకుండనున్నచో మీయిల్లంతయు ధనముతో నిండింపజేసి మీకానందముఁ గలుగజేసెదను. అట్లు గాక నన్ను శిక్షితునిగాఁ జేయఁదలంతురేని ముందుగా మీకు ప్రాణహాని కలుగఁ జేయుదును. ఇదినిక్కము.

ఇట్లు,
చోరనాయకుడు.

ఈయుత్తరమునుఁ జూచి సెట్టిగారును యువకుఁడును చకితులైరి. ఇంతలో దెల్లవారుటచే యువకుఁడు సెట్టిగారియొద్ద సెలవుఁదీసికొని గృహాభిముఖుఁడయ్యెను. పాఠకా! ఈ యువకుఁడు పోలీసుసర్కిల్ యినస్పెక్టరు రామచందుగారని వేర చెప్పవలెనా?





## అనుచరులు

సూర్యభగవానుఁడప్పటికప్పుడే యాకాశవీధి కరుదెంచి సుమారు రెండుగంటలు కావచ్చును. పశుపాలకులు తమ తమ పశువులను మేపుటకై తోలుకొని పోవుచుండిరి. బాలురు తమ తండ్రులకుఁ జల్దిముంతలను దెచ్చుచుండిరి. అట్టియెడ నొకమహారణ్య ప్రదేశమున మువ్వురు బాటసారులు నెత్తి మూటలతో వడివడి నడచుచుండిరి. వారట్లు పోయిపోయి

యొక సెలయేటియొద్దకుఁజేరి వారిభుజములపై నుండుమూటలను దింపికొనిరి. వారిలో నొకడటనున్న కొండప్రక్కకుఁబోయి యొక పెద్దముంతను దెచ్చెను. అంతనామువ్వురు నాసెలయేటిలోఁగాలుచేతులుఁ గడుగుకొని ముంతలోని యన్నము నాకులలోఁబెట్టుకొని తినుచు నిట్లు ప్రస్తావించిరి.

ఒక—ఒరే! యెంకా! నా మెళ్ళోంచిపోయినాయి. ఎంత బలువురా బాబు.

యెంక—నాకుమాత్రం లేదేటిరా సుబ్బా! మనిద్దరికన్న ఆపుల్లిగాడిపని నయంరా.

పుల్లి—మీాగలాంటూరుగానోరేనాకూ అలాగేఉందిరా

సుబ్బ—ఎలాగయినా మాకంటె నీకునయం. కాయితాలకనక ఆట్టేబలువుండవు.

పుల్లి—ఔనుగానొరేయెంకా! కాయితమంటే గేపకమొచ్చింది మన యజిమాని మనకేమో కాయితాలిచ్చిలాకన్నంలో పారైమన్నాడు. పారేచావురా యెంకా!

యెంక—ఆ! నాకిచ్చిందేదో నేనుపారేచాను.

పుల్లి—నువ్వోరా! సుబ్బా!

సుబ్బ—మరిశిపోయానురా! ఈయాల నారోజులు బాగోలేవు!

పుల్లి—పోనీ! వడకు. నాకో ఊగతోచింది శెపుతా వినండి. ఏటంటె మన దొరగోరిదారినెప్పుడురాడు. అంతుకుశేతీకాయితములుప్పల్లో పారేశి కన్నంలోనేయేశాం అని శెప్పుదాం.

సుబ్బ—ఓగిలోను సొప్పకేం యేంకా!

యెంక—నయమే, సొపుతానంట్రా నాకుమాత్రం తెల్దేటి.

సుబ్బ—ఎలాగైనా మనపుల్లిగాడికి మంచి మంచి ఊగలు తోత్తాయిరా.

యెంక—ఆడులేకపోతే మనవీయేల కన్నమొయి లేకనే పోదుము.

అని యనుకొనుచులేచి ముంతనటనేపారవైచి చేతులు కడిగికొని కాగితమును తుప్పలలో పారవైచి తిరిగి మూటల నెత్తుకొనునంతలో వెనుకనుండి యొకవ్యక్తి వారినికలసి కొనెను. వారావ్యక్తినిజూచి 'ఏంరోయిఎల్లిగా ఎక్కణ్నుంచి రోయి' అని యడిగిరి.

ఎల్లి—దొరగోరు మీకుసాయమెల్లమనిపంపేరు. నేను కలకత్తా యెల్తిలోకప్పుడే ఊరంతాగోలే. అంతుకుసేత మీరీ పాటికెల్లే ఉంటారనుకుని ఇలాగొచ్చాను.

పుల్లి—నువ్వుగంటే ఊళ్ళోకెల్లొచ్చావుగందా యేం గోట్రా ఊళ్ళో.

ఎల్లి—గోలేటి. ఊళ్ళో ఎక్కడచూసినా ఈగోలే. నాలుగులచ్చలడబ్బిత్తంట ఓరో ఎత్తుప్పోయారంట.

సుబ్బ—అంతుకునేరా! ఇంతబలుగున్నాయి.

పుల్లి—అయితే మనికి బగుమానముండన్నమాటే.

సుబ్బ—మరిలేదేటి. దీనికేంగానొరే ఇంతకన్నగొప్ప దుండంట, ఈయేలో రేపో ఓఅమ్మాయి నెత్తుకొత్తారంట, అది

కూడా ఐపోతే ఇంకాగొప్పబగుమానం దొరుకుద్ది.

వెంక—పొద్దెక్కిందే. రంగ్రడా. పోదాము.

ఇట్లు మాటలాడుకొనుచు వారు సుమారు మూడు మైళ్ళ దూరముపోయిరి. ఎల్లిగాడు నేలమట్టముగానున్న యొక తలుపును కాలతో ప్రక్కగా త్రోసెను. వెంటనే యొకసొరంగ మేర్పడెను.

పాఠక మహాశయులారా! వారలెటుబోయిరోయనియు యాతలు పేమివోయనియు తెలిసికొనగోరుచున్నారా. సరే! అటులైన మనమువారిని వెంబడింతమురండు.

తలుపుతీసిన నేమున్నవి. మెట్లు. ఇవియెంతవరకుండునో కదా. 'తినబోవుచు రుచియడుగనేల' యనునట్లు మనము లోనికి బోవుచుంటిమిగదా, మనకీతత్తర మేల. వారా మెట్ల గుండా మాటలతో లోనికి బోయిరి. పోగానే పైతలుపు మూసివేయబడెను. ఆమెట్లగుండ కొంతదూరము పోగానే యక్కడమరొక తలుపుండెను. దానికిఁగల మర్మము తెలిసినవారగుటచే దానినిఁ దెరచిరి. లోననేమున్నది, పెద్ద బంగాళా. ఆబంగాళాకు ప్రక్కగా కొన్నికొట్లుగల మరొక చావడి. ప్రతికొట్టునకును మూడువైపుల గోడలు నొకవైపు నారసములునుగలవు. ఆకొట్లకెదురుగ మరొక చావడిఁయు గలదు. అందును కొన్ని కొట్లుండవచ్చును. నాల్గువైపుల గోడలుతప్ప మరేమియునులేవు. మనపరిచయులా భాగ్య భూములోపలి తలుపుదాటి బంగాళాలోని కరిగిరి, బంగాళా

మధ్య చావడిలో నొక బలిష్ఠకాయుఁడగు యువకుఁడుండెను. అతనికిరమారమి పాతిక ముప్పది వర్షములుండవచ్చును. నల్లని శరీరము, తెల్లని చలువవస్త్రములం దాల్చియుండెను. కాళ్ళకు కలకత్తా స్లిప్పర్సుండెను. బంగాళాక్రాపు. ఆయువకుని ముందు వారామూటలనుదింపి యేకగ్రీవముగ "దొరా! దణ్ణాల"ని యరచిరి.

దొర—ఏమిరా! ఇపుడు పదిగంటలు కావచ్చినది. ఇంత యాలశ్యమేందులకుఁ జేసితిర'ని కోపముతో ననెను.

పుల్లి—చమించండి బాబూ! మూటలు బలుగ్గున్నా యిండి. అడ్డదారినొత్తే ఓరేవా యెనకాలే ఒత్తారేమో అని సుట్టుతిరిగొచ్చామండి.

దొర—మీాకు ఎల్లిగా డెక్కడ కనబడ్డాడు.

పుల్లి—చద్దికూళ్ళు తింటుంటే ఒచ్చాడండి ఊళ్ళోకెళ్ళి.

దొర—సరే వెళ్ళినపని సరిగాఅయినదా?

పుల్లి—చిత్తంబాబు!

యెంక—తిమరు శెప్పడం కాకపోడం కూడానాండి బాబియ్యా.

దొర—నేచెప్పినచోట్ల ఉత్తరాలు పడేశారా?

పుల్లి—సిత్తం పడేశామండి.

దొర—మీాబహుమతు లెప్పుడిమ్మంటారో చెప్పండ నుచులేచి యామూటల నెటకో బట్టించుకొనిపోయి యొక చోట పడవేయించి "ఒరే! మీాకపై బహుమతులిదిగో తీసి కొనుడు" అనుచు ముప్పరకను మూడుఏబదులనిచ్చి పొమ్మ

నెను. ఎల్లిగా డక్కడనేయుండెను. "ఒరే యెల్లిగా నీవు పోయి కృష్ణారావుగారిని బిలుచుకొనిరమ్ము" అనెను ఎల్లిగాడు పోయి మరలనొకవ్యక్తితోఁ దిరిగివచ్చెను. వచ్చినవ్యక్తి "భీమానందా! నన్ను పిలిచిన కారణంబేమి" అనియడిగెను. ఎల్లిగాని బో నాజ్ఞాపించి వచ్చినవ్యక్తితో దొరయొక్క రహస్యమందిరమున కేగెను.

---

## ౨

### వేళావిశేషము

అది వేసవికాలమగుటచే జనులందరు చల్లనిగాలికై హుగ్లీనదీతీరమునకు వచ్చుచుండిరి నదీతీరమున నొక భవనముండెను. ఆభవనము రమణీయమై కడుశోభాయమానమై యలరారుచుండెను సాయంకాల మైదుగంటలు కావచ్చుచుండెను. కొందరు మనుజులు రోడ్డుదిగి యిసుకపై కూర్చుండి యుండిరి కొందరు నదిలో స్నానము చేయుచుండిరి.

ఆసమయమున నొక స్త్రీ యారోడ్డున నడిచి పోవుచుండెను. ఏలకోగాని యామెముఖమింతకు కళతగ్గియుండెను. ఆమె శరీరసుకుమారతయు దీనవదనమును గాంచిన కాలినడకను బోవుచున్న యాబాలికపై నెవ్వారికిజాలి కలుగకుండును. ఆబాలిక అట్లు పోయిపోయి యొకభవనము లోనికిబోయెను.

ఆభవనమునకు మధ్యనొక హాలుకలదు. హాలునకిరుప్రక్కల మూడేసిగదులు గలవు. దానిపైనొక డాబాకలదు. డాబాపై నొకహాలును రెండు గదులును గలవు. పైన బంగాళాపెంకు వేయబడియుండెను. మనబాలిక యాసౌధోపరిభాగమునకుఁ బోయి యొకగదిలోఁ గూర్చుండియుండెను. ఆమె యాగది కిటికీగుండ వీధివైపు పదేపదే చూచుచుండెను. ఆమెవైఖరిఁ జూడ నెవ్వరికొఱకో నిరీక్షించుచుండెనని మాపాఠకులూహింపకపోదురా!

ఇట్లొక యరగంటచూచి విసువుఁజెంది రెండవగదిలోనికి బోయి యొకమడతకుర్చీపైఁ గూర్చుండి యొకపుస్తమునుదీసి చదువుచుండెను. మరికొంతసేపటికొక పురుషుఁడు తెల్లనిచలువచేసిన మల్లుపంచనుగట్టి ఇంగ్లీషుట్వీల్ పోలో షర్టును దొడగిపైనొక బ్లూసర్జ్ షార్టుకోటునువేసికొని క్రాపు చక్కగాదిద్ది మనబాలికయున్న సౌధము నారోహించెను. అడుగులసవ్వడిచే నాబాలిక యెవ్వరోవచ్చుచున్నట్లు తెలిసికొని యాగదివీడి మొదటిగదిలోనికిఁ బోయెను. మన పురుషుడు నాగదింబ్రవేశించెను. అంత వారిద్దరు చెరియొక కుర్చీపైఁ గూర్చుండిరి.

పురు.—రాజేశ్వరి గతరాత్రి మీయింట చోరీ జరిగినదని తెలిసినది నిజమేనా.

రాజేశ్వరి—మనోహరా ఏమని చెప్పుదునుమాయిల్లంతయు గుల్లచేసిరి నాతండ్రి శయనాగారములోనియినుపపెట్టె లోనున్న దస్తావేజులు మున్నగు పత్రములును నగలునురొక్క

ము నగఁబోయిరి చిన్ననాటినుండియు కష్టపడి యార్జించిన సొమ్ము గానరాకుంటచే నాతండ్రి రోదనము సేయసాగెను. పోలీసు సర్కిల్ యినస్పెక్టరువారువచ్చి కొన్ని ప్రశ్నలడిగి మాకభయమిచ్చి యెమ్మార్మరడించి యినుపపెట్టెలో దొరకిన యుత్తరముతో వెడలిపోయిరి.

పురు—ఏమీ! ఉత్తరములుకూడ వ్రాసిరా! అందలి సంగతులేమి.

రాజేశ్వరి—నేనెరుగను. నాతండ్రియును రామచంద్రు గారున్ను క్రిందికిదిగి హాలులోచదివిరి. నేవినలేదు.

పురు—నేనును రామచంద్రుగారికి తోడ్పడెదను. మీసొమ్మునకు భయములేదు. నీవు మీతండ్రిగారి నూరడించుచుండుము. నీపరీక్ష యేమగును.

రాజేశ్వరి—మొన్ననే పరీక్షలైనవి. పేపర్లు బాగుగనే వ్రాసితిని. మీపట్టపరీక్షప్యాసయిన దంటిరిగా.

పురు—అగును. నేనీరాత్రియే పోయి చంద్రుగారిని కలసికొనియెదను. నాకు కొంచెము పనియున్నదని చెప్పి వెడలిపోయెను. రాజేశ్వరియు మరికొంత సేపటనేయుండి పిమ్మట వెడలిపోయెను.

పాఠకా! లోకమంతయు నొక్కరీతిగ నుండునా! ఒక యూరపెండ్లి యింకొకయూర మరొకటి. ఊళ్ళవరకుఁ బోనేల. ఒకయూరనే ఒక యింటవిచారము. వేరొకయింట సంతోషము. అట్టి విచారములకు గాని, సంతోషములకుగాని

యనేక విధములగు కారణము లుండవచ్చును, ఇదియంతయు భగవంతుని చిద్విలాసము. ఒకరిని నవ్వించుట, మరియొకరిని యేడ్పించుట. ఇట్లుచేయు టెందులకో తెలియునా? సంతోష సమయమున భగవంతుని మరచుటయు దుఃఖసమయమున భగవంతుని దలచుకొనుటయు లోకసహజము అందుచే నందరకొకసారి సంతసము గల్గించిన తన్ను దలచువారుండరనియు దానంజేసి తనకుపనిగలుగదనియు నందర నొకేసారి విచారసాగరమున ముంచిననందరు నొకేసారి తన్ను ప్రార్థింతురనియు దానంజేసి తనకేపనిచేయుటకు దీనుల మొరలాలించుటకు సావకాశముండదనియు, నట్లుచేసి యుండనోవు.

రమారమి ఒంటిగ టయ్యెనది. కలకత్తానుండి చంద్రనగరము పోవురోడ్డుపై నొక కారు చంద్రనగరమువైపు పోవుచుండెను ఆ కారు వెనుక సీటునకు తెరగట్టబడి యుంటంజేసి యందు ఘోషాస్త్రీలున్నారని చెప్పవచ్చును పదిమైళ్ళు వచ్చెనో లేదో హఠాత్తుగ కారాగిపోయెను. కారుడ్రైవరు దిగి యేమిపోయినదోయని చూచెను. పాపము ఇంజను పాడయ్యెను. అందువలన నా డ్రైవరు కారులోనివారితో 'బాబూ! కారింజనుపోయినది. మీరుదిగి ఎటకైనా బోండు! ఆపదలు చెప్పివచ్చునా' యనెను. కారులోనివారునుదిగి ఎవరిదారిని వారు బోయిరి. పిమ్మట నాఘోషాస్త్రీలును దిగిరి. అందు పాతిక వత్సరములుగల యువతియు పదునాలుగేండ్ల బాలికయు తొమ్మిదేండ్ల బాలుడునుగలరు. వారివెంట నొక కాన్స్టేబిలుండెను. వీరునల్వురును సమీపగ్రామమునకై

బోదమని పోవుచుండ నొకకాలీబండి వీరిని కలిసికొనెను. కాన్ష్టెబిలా బండిని కొంతబాడుగకు మాటాడి యజమానులను బండినెక్కించెను. బండినడచుచుండెను. అంతనాయువతిః నారాయణస్వామి, అయ్యగారు కార్లయనుభవ మెరింగిన వారగుటచేతనే మనను రైలులోఁ బొమ్మనిరి. కాని నీవు కారునేగుదిర్చితివి. చూచితివా! మనగతి ఏమగుచున్నదో! అనుచు కఠినముగ బలుకఁజొచ్చెను. పాపము! నారాయణస్వామి మాత్రమిట్లు వచ్చునని యెఱుంగునా! పోలీసు వారనగనే కార్లవారు ఛార్జిపుచ్చుకొనరనియు ఆఛార్జి తాను కమీషను కొట్టవచ్చుననియు నట్లు చేసెను.

ఇట్లు వీరు మాటాడుచుండగనే బండిరోడ్డుదిగి అరణ్యమార్గముంబట్టెను. నారాయణస్వామిదికని పెట్టి 'ఓయీ! ఇదేమి, ఇట్లు తోలుదువు. దారి తెలియదా!' అని బండివాని నడిగెను. బండివాడు తనపనినిమానలేదు. ఇంతలో నెటనుండియో యిరువురు వ్యక్తులువచ్చి నారాయణస్వామి నొక్క బలముగుపోటుపొడిచి యాతని యాయుధములగు పిస్తోలును లాగికొనిరి. పిమ్మట నందున్న బాలికను, బాలుని బంధించి నారాయణస్వామిని చంపి బంధితులతో వెడలిపోయిరి. బండివాడుకూడ వెడలిపోయెను. అయ్యో! వేళావిశేషము. ఎట్టివేళ బయలుదేరితిమో, అనుచు నాయువతి మూర్ఛితురాలయ్యెను.

## ౪

### ఒకభవనము

పాఠకా! మనమీగొడవలలోఁబడి రామచంద్రుగారేమి చేయుచున్నదియు మరచితిమి, రమ్ము చూతము. మనమిపుడెక్కడనున్నను మనోవేగమును మించినవేగముతో చంద్రుగారియొద్దకుఁ బోగలముకదా. ఆహా! మనయీశక్తికి మేరయున్నదా. రామచంద్రుగారు సెట్టిగారిల్లువీడి స్వగృహము జేరి కాలకృత్యములను దీర్చుకొని ఏదియో యాలోచించుచు మడతకుర్చీపై నాసీనులయ్యిరి. కొంతసేపటికి గడియారము టంగుటంగున నేడు గంటలు కొట్టుటచే దిగ్గున లేచి నోట నొక కిళ్ళీనుంచుకొని యూనిఫార్మువైచుకొని సిజరుసిగరెట్టు ద్రావుచు నెటకోబోవుచుండెను ఆయనట్లు పోయిపోయి బాగ్ బజారునకు ప్రక్కనున్న యొక సౌధము ముంగలనిలిచి తలుపుగ్రుద్దెను. అంతట నొకసేవకుడు వచ్చి తలుపు తెరవ 'నాగభూషణరావుగారు లేరా' యనియడిగెను. సేవకుఁడున్నారని చెప్పి లోనికిఁబోయి చావడిలోనియొక కుర్చీపై నాసీనుడయ్యెను. మరొక నిముషమునకుఁ లోననుండియొక వృద్ధుడివలకువచ్చి 'ఏమండోయి చంద్రుగారూ! ప్రొద్దుననే వచ్చితిరి' అనుచునుచితాసీనుండయ్యెను.

రామ—ఏమియు లేదండి. మీతోనొక వింతచోరీఁ జెప్ప వచ్చితిని.

వృద్ధు—ఏమిది. ఎప్పుడండోయి చెప్పుమరుగాని ముందు కాఫీనిదీసికొనుడు.

రామ—అవశిష్టములన్నియు దీరినవి అని కడచిన రేయి జరిగిన వృత్తాంతమెల్ల సవిస్తరముగఁ జెప్పెను. పిమ్మట నుత్తరములనుగూడ చూపెను.

నాగ—చందుగారూ! చోరీయేగదా! ప్రయత్నలోపము చేయక పట్టుకొనుడు. ఇదియింకను ముదరగలదని నాకనుమానము తరచు నాకువర్తమానములఁ దెలుపుచుండుడు.

రామ—చిత్తము నేనుపోవుదును అవసరము వెంబడిని మరలవచ్చెదనని చెప్పి సెలవుతీసుకొని వెడలిపోవుచుండెను. అంత నొకటపాబంట్రోతొక కవరును చందుగారికిచ్చెను.

రామచంద్రాయుత్తరమును విప్పకుండగనే గిఱుక్కున వెనుకకుఁ దిరిగి నాగభూషణరావుగారింటఁ బ్రవేశించెను. నాగభూషణరావుగా రాశ్చర్యముతో 'ఏమండీ చందుగారు మరలవచ్చితిరి' అని యడిగిరి. చందుగారు తనకువచ్చిన కవరును చించి అందలి యుత్తరమిట్లు చదివిరి—

కలకత్తా,
10—4—1918.

రాజశ్రీ రామచందుగారికి, తమ శ్రేయోభిలాషి వ్రాయు హితము.

అయ్యా !

నేను తమకిదివర కొకసారి యుత్తరమును వ్రాసియే

యుంటిని, కాని మీరు మీ ప్రయత్నమును మానలేదు. మీ కార్య ప్రయోగమువడినది. మీరు వయోవృద్ధులగు నాగభూషణ రావుగారినికూడ పాడుచేయుకుడు. ముఖ్యముగా మీహితము కోరి వ్రాసితిని. మీతలపై వారుకూడ మమ్ములఁ బట్టలేరు, మా కిపుడు మీ రేదైన జాబుపంపదలచిరేని కిలాసమునందిరమునకు ప్రక్క నున్న బంగాళా వెలుపలిగోడకు గల లెటరు బాక్సునందు వేయుడు ఇక వ్రాయవలసిన సంగతులేమియును లేవు.

ఇట్లు

శ్రేయోభిలాషి, అనుచరుడు.

ఈయుత్తరమును జూచి రావుచందుగార్లిరువురును విస్మయమందిరి. అంత "రావుగారూ! చూచితిరా వీనిధైర్యసాహసములు" అనెను. చందుగారు పిమ్మట వారిరువురును చాల సేపటి వరకెద్దియో ముచ్చటించుకొని భోజనపు వేళ యతిక్రమించుటచే రావుగారియొద్ద సెలవుతీసికొని చందుగారు నిజగృహాభిముఖుడై చనెను.

రామంచందుగారు వెళ్ళినతర్వాత నాగభూషణరావు గారు భోజనము చేసి తనశయ్యపైఁ బరుండి చోరుల యుత్తరమునుగూర్చి దీర్ఘాలోచనాపరులయిరి.

"అహా! ఆయుత్తరములో ననుచరుఁడని సంతకము న్నది. ఈతని యనుచరుడేవైన యిన్నేళ్ళనుండి యనుభవముకలవాడేల కనిపెట్టలేదు. ఈచోరుడీతనికి సంబంధించియుండవలెగదా ఆ! యేమనుచుంటిని. అట్లైనన్నటికినిజముగ జెను.

ఈతడు పోలీసుద్యోగస్తుడు, ఐననేమి, ఎందరులేరు. ఎన్ని కథలువినియుండలేదు. కావచ్చును, కాని చందురివిషయము లో నట్లనుమానింపరాదు. ఈతనిని నేనుబాగుగ నెఱుగుదును. ఈతఁడట్టివాడుకాడు. సజ్జనుఁడు. ఇదివరకు చాలకేసులలోపనిచేసి గొప్పపేరును సంపాదించినాడు. అట్టివానిపై నేనన్యాయముగ నేరారోపణచేయుట పాడిగాదు. అని తలపోయుచుండెను.

రామచంద్రుగారును రావుగారియొద్ద సెలవుదీసికొనిన పిమ్మట గృహంబు జేరి భోజనముచేసి యాలోచనానిమగ్నుడై పరుండెను అట్లు రాత్రి రెండుగంటలవఱకు కాలయాపనమొనర్చి బైసికిల్‌పై వడివడి రావుగారింటికిఁ బోయి చోరులకు వ్రాయవలసిన జాబునుగూర్చి నుచ్చరించుచు సూర్యోదయ సమయముపరకుఁ గాలయాపన మొనర్చిరి. పిమ్మట చందుగారింటికిఁబోయి యొక కుర్చీపై గూర్చుండిరి. ఇంతలో పోలీసువచ్చి 'అయ్యా! తమకొరకెవ్వరో వచ్చిరి'ని చెప్పెను. చందుగారు నాతని రమ్మని చెప్పిరి. రక్షకభటుడు పోయి యొకవ్యక్తితో లోనికరుదెంచెను. వ్యక్తియు నాతనికి నమస్కరించెను.

రామ—దయచేయుడు. ఈకుర్చీపైఁ గూర్చుండుడని తన కెదురుగనున్న కుర్చీని జూపెను.

వ్యక్తియు కుర్చీపై గూర్చుండెను.

రామ—అయ్యా! తమదేయూరు.

వ్యక్తి—మాదీయూరే.

రామ—మీనామము.

వ్యక్తి—చంద్రాననుఁడు.

రామ—మీతండ్రిగారిపేరు.

చంద్రా—ముత్యాలరావుగారు.

రామ—తమరేపనిమీఁద దయచేసిరి.

చంద్రా—తమతో నొకరహస్యము మాటలాడుటకు

రామ—ఇచట నెవ్వరును లేరు. మాటాడవచ్చును.

పిమ్మట నాయిర్వురు నొకయరగంటవరకెవ్వియో రహస్యముగ మాట్లాడుకొనిరి. తదనంతరము చంద్రాననుఁడు చందుగారియొద్ద సెలవుఁదీసికొని పదుగంటలగుసరికి స్వగృహము చేరెను. భోజనముచేసి చల్లగాలికై చావడిలోఁ దిరుగుచుండగా తండ్రివచ్చి 'నాయనా! నీకొక యుత్తరమువచ్చినది. నీవు లేకపోవుటచే నేను దీసికొని నీగదిలోని బల్లపై నుంచితినని చెప్పి వెడలిపోయెను. అంత చంద్రాననుఁడు తన గదిలోనికిఁబోయి యుత్తరమును దీసికొని యొకకుర్చీపై కూర్చుండి దీపపువెల్తురున దానిని చదువుకొనెను. అందేమి యుండెనోగాని యాయుత్తరమును జదివినకొలది నాతని మోమున క్రోధము హెచ్చుచుండెను. నయనము లెఱ్ఱఁబాఱెను. పండ్లు పటపట కొరుకుచుండెను. తెల్లనిమోముకందెను. కొంతవడికి శాంతము దెచ్చుకొని దీర్ఘాలోచనాపరుండై యుత్తరమునుదాచి పరుండెను.

అంత ముత్యాలరావుగారువచ్చి 'నాయనా! పరుంటివా' అనిరి.

చంద్రా—లేదు. ఎందులకు.

ముత్యా—ఏమియు లేదు. ఇయుత్తర మేదియో చెప్ప వచ్చునా.

చంద్రా—మా స్నేహితు నకొకనికి యుద్యోగము దొరకినదట. ఉత్తరము వ్రాసినాడు.

ముత్యా—సరే. పరుండుము.

చంద్రాననుడును తొమ్మిది దాటుటచే పరుండెను.

పాఠకులారా! చందుగారేమి చేయుచుండిరో!

రామచందుగారు రాత్రిభోజనమైన పిమ్మట చోరుల పేరనొక యుత్తరము వ్రాసి కవరులోనుంచి పరుండిరి కాని నిదుర రాలేదు. అందుచే నెంతకును దెల్లవారునట్లగుపడుట లేదు. కాని తెల్లవారక మానునా! కుక్కుటములు కూయజొచ్చినవి. ఆకూత మనచందుగారి కర్ణముల సోకినంతనే దిగ్గున లేచి యథోచిత కాలకృత్యంబులఁ దీర్చుకొనుసరికి నాలు గంటలు దాటెను. వెంటనే బైస్కిల్ పై నెటకోఁ బోనుద్యుక్తుఁడగుచుండ చంద్రాననుఁడు బైస్కిల్ నుండి దిగి చందుగారికి నమస్కరించెను. అంత వారిద్దరును రావుగారింటికేగిరి.

చందుగారు యువకునితో రావుగారిలు సేరుసరికి రావుగారు దంతధావనము చేసి లోనకుఁబోవుటకు లేచెను. ముగ్గురు చావడిలోని కుర్చీలపై నాసీనులైరి. పిమ్మట రావుగారు యువకునిగూర్చి ప్రశ్నింప చందుగారాతని చరిత్రను సవిస్తరముగఁ

దెల్పెను. చంద్రాననుఁడొక యుత్తరమును జేబునుండి పైకి దీసి యది తనకు రాత్రివచ్చెనని చెప్పి ఇట్లు చదివెను.

కలకత్తా,

10—4—1918.

చిరంజీవి చంద్రాననునకు—

శ్రేయోభిలాషి చిరాయుష్మంతుఁగా దీవించి వ్రాయు హితము—

నీవు నా జేబులోని వరించినట్లు తెలిసినది. ఆలోచింపక నీకు వలదు. నీకు దక్కదు. మానవులంటి వేవి నీకు చావు కప్పదు జాగ్రత. నీ సేమము కోరినవాడనగుటచే ముందుదెల్పితిని.

ఇట్లు,

శ్రేయోభిలాషి, సోదరుడు.

పిమ్మట చంద్రకాంతుఁడు చోరులకు వ్రాసినయుత్తరము నిట్లు చదివిరి.

కలకత్తా,

11—4—1918

చోరనాయకునకు, రామచంద్రు వ్రాయునది.

నీవు వ్రాసినయుత్తరమామూలాగ్రముగ చదివితిని నీ ధైర్య సాహసకృత్యములకు మెచ్చుకొంటిని. వెంటనే నీవు నాకుఁగన పించి యథార్థమును వెల్లడిజేసినచో నిన్ను రక్షింతును. అట్లు గాదేని నీయుద్యమములో నీ చేతిలో నేనైన కడతేరవలెను, నా

చేతిలోనిదైన కడతేరవలెను. ఇది నా నిశ్చయము. నీవు చేయు పనులు మంచివి కావు. ఈ విషయము నీవును యెరింగినదే.

ఇట్లు,

రామచంద్రుడు

ఈ యుత్తరమును చోరులు చెప్పినచోట వేయుటకుఁ చంద్రాననుని నియోగించిరి. చంద్రాననుఁడును సమ్మతిని సూచించి చనుగారతో వెడలిపోయెను

సాయంకాలము నాల్గుగంటలగుసరికి మనచంద్రాననుఁడు తాను తెచ్చిన యుత్తరమును లెటరుబాక్సునందు పడవైచి యెవ్వరికొరకో యాబంగాళాకుఁజేర నిలిచియుండెను, ఐదుగంటలవరకు వేచియున్న నెవ్వరును వచ్చుజాడ గాన్పింపలేదు. అందుచే విసుగుజెంది యింటికిఁబోయి మరల నేడుగంటలకు వచ్చెను. కొలదికాలమునకే యేదో ధ్వనియయ్యెను. ఏమాధ్వని తాళము తీయుధ్వని. చంద్రాననుఁడును సడిచేయక మెల్లగ గోడదరిఁజేరి చెవులు నిక్కించి వినుచుండెను. మరికొంతసేపటికేదియో సంభాషణ వినవయ్యెను. అదియంతస్పష్టముగ వినబడకున్నను కొన్నికొన్ని మాటలు వినబడుచుండెను, ఆమాటల సందర్భమునుబట్టిచూడ చోరులు తామువ్రాసినయుత్తరమును జదువుకొనుచుంటిరని యూహించెను. చంద్రాననుఁడు వారిముఖములఁజూడ నాసక్తిజనింప గోడకేదైన రంధ్రమున్నదేమో యని నలుదెసల పరికించి చూచెను. కొండమొత్తున నొకపరంజాగూడు గాన్పించెను.

కొద్దిశ్రమతో నాతఁడు పైకెక్కి రంధ్రముఁజూచుచుండెను గదిలో నిర్వురుపురుషులొక దీపపు వెల్తురున నొక కాగితమును చదువుకొను చుండిరి. వారిమొఖములొకపరి చిఱునగవుతోడ మఱొకపరి క్రోధముతోనుండెను. అందొకరిదృష్టి కన్నమునుండిపొంచి చూచుచున్న చంద్రాననునిపైఁబడ దిగ్గున లేచెను. ఆదృశ్యమునుగాంచి చంద్రాననుఁడు క్రిందకు దిగెను. ఇంతలో నాలేచినవ్యక్తి వలకువచ్చి చంద్రానను నొకగ్రుద్దుగ్రుద్దెను. చంద్రాననుఁడు తిరుగఁగొట్టెను. ఇర్వురును ముష్టియుద్ధమునకు డీకొనిరి. కొంతవరకట్లుపోరియావ్యక్తి పరుగునఁబోయి నదిలోదుమికి యదృశ్యుఁడాయెను.

---

## ౭

## అనాధబాలిక

నాఁడెంతప్రొద్దెక్కినను సూర్యభగవానుఁడాకాశవీధిని బయనముసాగించుచున్నను బయటకురావెరచుచు మేఘముల చాటుననే బోవుచుండెను. అట్లుపోవుచు నొక్కొక్కప్పుడా మేఘములమధ్యనుండి తొంగిచూచుచుండెను. ఆతడట్లుచూచు నప్పుడైన నాతనిముఖము వికాసముగలేక విచారమును సూచించుచుండెను. అంతియగాక సూర్యుఁడుదీనబంధువు డగుటచేనాఁడు జరుగబోవు దురంతములఁగూర్చి విడచుకన్నీటిబిందువులోయనునట్లు నీటిబిందువులుకూడ రాలుచుండెను. అట్టి

సమయమున మనకుం బరిచితమగు భాగ్యహామండలి నారసపు గొట్టుగదులలో నొకదానియందొక స్త్రీ యిట్లు విలపింపసాగెను.

"హా దైవమా! నీకు నేనేమి యపరాధంబొనర్చియుంటిని నన్నిట్లు చేయుట నీకు పాడియె. నా తల్లిదండ్రులకు నేనేక పుత్రికనుగదా జగద్రక్షకా! నీకేల నాపైం గనికరము లేకుండెను. నాతలిదండ్రులు నాకై యెంతగ విలపింతురోగదా! అయ్యో! జనకా! నా చిన్ననాటినుండియు నీవు నన్నతిగారాబమున బెంచి నన్నొక్కగడియయైనను విడిచెడివాడవుగావే! నీ వాఫీసుకు బోవునపుడైన నన్ను నీతో గొనిపోవదలంచియు మా యమ్మ బెంగపెట్టుకొనునేమోయని మానెడివాడవుగావా. అట్టి వాడవు నేడెటులుంటివోగదా. నేడేయున నేల? ఇన్ని నాళ్ళనుండియును, ఇకముందును గూడ నెటులుండెదవోకదా. హా తల్లీ! నీమాట వేఱ చెప్పవలెనా! 'తల్లిగంటె వేరు దైవంబు గలదె' అను నార్యోక్తి కలదుగదా. నాకు నీయెడ లెట్టి భక్తి యుండెనో నీకును నాపై నంతకన్న వేయిమడుంగులెక్కువ ప్రేమయున్నదికదా. భోజనము చేయునపుడైనను నిదురించు వేళయైనను యూరికిం బోవుతఱియైననుం, వేయేల సర్వకాల సర్వావస్థలయందును నీవు నన్ను నెడబాయెరుంగవుగదా ఆడుకొను వేళయైనను నేను నా నెచ్చెలులతోంగూడ కలిసి బయటకుం బోవుటకిష్టపడక నీయెదుటనే యాడుకొమ్మనెడిదానవు కదా. నేను మీయొద్ద నెంతగారాబమునం బెరిగితినో నంతకన్న యధికముగ వీరిబాధలకు లోనగుచుంటిని. ఈవి దెవ్వరో నే

మరికొంతసేపటికి దెప్పరిలి లేచి యాగది నాల్గుమూల
లను బరికించుచుండెను అంతలో నొక వికృతాకారియగు
స్త్రీ యామెయుండు దయ్యమువలె సాక్షాత్కరించి గంభీర
స్వరమున 'ఓసీ! రండా ఏడువకుము నీపని నేటితోసరి.
నీవెంత విలపించినను లాభములేదు. లెమ్ము. నీవు తలంటు
కొనవలయునని" పలికెను. ఆపల్కులకు మనజవ్వని యదరి
పడి గద్గదస్వరమున "ఓసీ! ఎందులకే నేను తలయంటు
కొనుట" అని యడిగెను. అంత నా స్త్రీ "ఓసీ! నీకిప్పుడు
తలయంటించి మాకాళికాదేవికి బలీయవలసినదిగా మాయజ
మాని సెలవయినది. లెమ్ము! లెమ్ము! అని గద్దరించుచుం
డెను. 'బలి' యనుపద మామెకర్ణరంధ్రములు సోకగనే
మొదలు నరికినద్రుమమువలె నేలగూలెను. వికృతియు మరల
రావచ్చునని వెడలిపోయెను. మనజవ్వని మరొక నిముసమునకు
సేదదేరి 'హా దైవమా! నాయాయువు నేటితోనే సరియా.
అయ్యో! ఎంత పాపాత్మురాలను. హా జననీ. నాటినాయం
కాలపు చూపేకద గంటి జూపయ్యె నా. నీవు నాహృత్కమల
మందున్నను కన్నులారగాంచు భాగ్యమే లేదుకదా! హా!
ప్రాణప్రియా! నీవుండియుకూడ నీసమయమున నన్ను రక్షించ
లేవా! ఇదియేనా! నీమగతనము. ఆ! ఆ!! ఏమి. ఎవ్వారిని
దూఱుచుంటిని. నా ప్రాణప్రియుఁ నేనా! అయ్యో! పాపమాతఁ
డేమిచేయగలడు. ఎవ్వరును జొరలేని మహారణ్యకూపంబు
నందుంటిగదా. హా! దైవమా! కడసారి ప్రార్థన. నేడు నేఁ
జచ్చుట నిశ్చయము. నన్ను రక్షించువారెవ్వరును లేరు. నేసి

క్రూరుల చేతిలో మరణించుచుంటినని నాకెంతయు విచారము గలదు. కాని మరణించుచుంటినని గాదు. నాకీవిచారము లేకుండ జేసి నాకు మోక్షము నొసగుము నేలేని విచారముఁ దీర్చి నాతల్లిదండ్రులకు నన్ను మన్నింప జేయుము. ఇదియే కడసారి ప్రార్థన. నా ప్రాణప్రియ'' అని యనుచుండగనే వెనుకటి క్రూరకాపాలియు మరల వచ్చి "చాలు! చాలు! ఊరకొనుము. ఏడ్చిన గుండెపై తన్నెదను. నీవేడ్చిన నిన్ను బలిచ్చుట మానెదననుకొంటివా! లే రండా!" అని గద్దరించి యీడ్చుకొనిపోయి యభ్యంగన స్నానముచేయించి యొక పసుపుచీరను గట్టినదుట నొక కుంకుమ బొట్టుపెట్టి జీవచ్ఛవమైపడియున్న యా బాలిక నీడ్చుకొని పోవుచుండెను.

గృహములోని మనుజులెల్లరు మధుపానమత్తులై యుండిరి. వారందరును 'భీమానందకు జయ్' అని కేకలు వేయుచు నడుమనడుమ యువతీలాపమును బెదరించుచు నొక సొరంగమార్గముం బట్టిరి. స్త్రీపురుషులతోఁ గలసి వారందరు సుమారు ఒక వందమంది యుండిరి. సొరంగమంతయు ఎలక్ట్రిక్ దీపములచే నలంకరింపబడి యుండుటచే నడచిపోవుటకు చీకటి లేక హాయిని గొల్పుచుండెను. వారా సొరంగమునుండి యొకరివెనుక నొకరేగుచుండిరి. ఆసొరంగ మొక మనుష్యుఁడు సునాయాసముగా నడచిపోగల విశాలము గలదియై యుండెను. వారు చాలదూరముపోయి సుమారు తొమ్మిదిగంటలకు కాళికాలయమునకు సమీపముననున్న బహిర్ద్వారముగుండా పైకివచ్చి కాళికాలయమును సమీపించిరి.

సెట్టిగారు గాఢనిద్రయందుండిరి. అంతనొక యువకుడు జేబునుండి యొక రుమాలునుదీసి సెట్టిగారి నాసికవద్దనుంచెను. అంతనాయిద్దరును చేతిరుమాలునటనేవిడచి సెట్టిగారిని మోచికొనిపోయి తమకారులోనుంచి కారుతో నదృశ్యులైరి.

మరికొంతసేపటికి సేవకుడు తిరిగివచ్చెను. ఎప్పుసరి వెనుకటనున్నవారు లేరు. కారుగూడ లేదు. తలుపులన్నియు తెరువబడియున్నవి. అదిచూచి సేవకుడు పరుగుఁబోయి తొట్రుపాటుతో సౌధమునెక్కెను. సెట్టిగారి పడకగది తలుపుగూడ తెరువబడియుండెను. గదంతయు వెదకెను. యజమాని లేడు. సేవకుడతి కంగారుతో 'మోసము! మోసము!!' అని యరచి శయ్యపైఁ బడియున్న చేతిరుమాలును వాసన జూచెను. వెంటనే 'హా! హా!' యనుచు మూర్ఛిల్లెను. ఈయలజడికి ప్రక్కగదియందున్న రాజేశ్వరి మేల్కొని తండ్రి గదిలోనికి వచ్చెను. గదిలో తండ్రి లేడు. సేవకుడు మూర్ఛలోనుండెను. అతని చేతిలోనొకరంగు చేతిరుమాలుండెను. 'దీనిని వాసన చూడవద్దు' అని పెద్ద యక్కరములతో వ్రాయబడి యుండెను. అదిమన రాజేశ్వరికంటఁ బడెను. అందేదియో చిత్రముండునని యెంచి పరిచారకులచే కడిగించెను. రుమాలు తెల్లనయ్యెను. దానిపై వెనుకటియక్కరములు లేవుగాని అచ్చొత్తింపబడిన యుత్తరము మాత్రమొకటి యందు చూపట్టెను. మనరాజేశ్వరి దానిని చదువుచు చకితురాలై యుల్లమున భయమొంది వివర్ణముఖియయ్యెను. ఉత్తరము

పూర్తి చేయుటతడవుగ మోహమ్రబారెను. నయనద్వయము నిప్పుకణములు గ్రక్కుచుండెను. మోము గిఱ్ఱున దిరుగుచున్నట్లుండెను. కనురెప్పపాటులో మూర్ఛిల్లెను, పరిచారికల శైత్యోపచారములచే లేచికూర్చుండి పానీయముం గ్రోలి యొకకుర్చీపై గూర్చుండెను. అప్పటికప్పుడే రెండుగంటలు దాటెను. రాజేశ్వరి యుత్తరమున్న చేరుమాలొక చేతియం దుంచుకొని యొక తెల్లకాగితముపై రామచంద్రుగారి కొక లేఖ వ్రాసి యొక పరిచారికను బంపివేసెను,

పాఠకాగ్రణీ! మనము రామచంద్రు పోలీసుఇన్స్పెక్టరని తప్ప వేరేమియు నెఱుంగము. ఆతనివిషయము కొంచె మాలోచింతము. రామచంద్రు కులమున క్షత్రియుఁడని ముఖతేజమునుబట్టియే చెప్పవచ్చును. వయస్సు ముప్పదియేండ్లకు లోపు. కాపురము చంద్రనగరము. ఉద్యోగములో నుంటచే గలకత్తా మూడేండ్లక్రిందటనే వచ్చెను. ఈమూడేండ్లలోపల నైదారు గొప్ప కేసులలోఁ బనిచేసి పేరుకాంచెను. ఈతడు బహుశాంతుడు. ఎవ్వరికేని యాపద సంభవించినట్లు తెలిసినచో వచ్చుటకు సత్వరముపోయి వారినోదార్చును. సమయమువచ్చిన ప్రాణమునైన నర్పించి యెదుటివారికష్టములఁ గాచును. ఈతనియెడల పోలీసు సూపరింటెండెంటుగారి కభిమానము మెండు. నాగభూషణరావుగారికీతఁడు బహిఃప్రాణము.

రామచంద్రుగారప్పుడే నిద్రనుండి మేల్కొనిరి. ఆసమయమునకే రాజేశ్వరి పంపిన పరిచారికయు చంద్రుగారి

గృహముసొచ్చి 'చందుగారున్నారా! ఆపద!' అని కేక వైచెను 'ఆపద' యనుపదము చందుగారి కర్ణరంధ్రముం బ్రవేశించినది. కాళ్ళకు టెలిగ్రాం వెళ్ళియుండెను గాబోలాయన యప్రయత్నముగనే యీవలకువచ్చిరి. పరిచారిక యాతనికొక కవరునిచ్చెను. చందుగారాకవరు చింపియందలి సంగతులను జదివి 'వచ్చెదను. పొమ్మ'ని చెప్పి పంపివేసిరి.

పిమ్మట రామచందుగారొక చొక్కా దొడగికొని పైన తుండుగుడ్డ వేసికొని సైకిల్‌పై రావుగారింటికిం బోయిరి రావుగారు నప్పుడే నిద్రలేచి చావడిలోని కుర్చీపైం గూర్చుండిరి. రామచందుచితాసనాసీనుండై రాజేశ్వరి లేఖనుజూపి యిట్లు చదివెను.

కలకత్తా

11—4—1018

మహారాజశ్రీ రామచందుగార్కి—

రాజేశ్వరి యభివందనములు,

అయ్యా,

మాతండ్రి దొంగలచే గొంపోబడెను. గొప్పయాపదలో నున్నాడు. త్వరగవచ్చి రక్షింపగోరుచున్నాను.

ఇట్లు,

రా జే శ్వ రి

నాగ—చందుగారూ, రాజేశ్వరి యెవ్వరు?

చందు—సెట్టిగారికూతురు.

నాగ—మీకెట్లు తెలియును?

రామ—ఆవాఁడు సెట్టిగారే చెప్పిరి.

నాగ—సెట్టిగారిని దొంగలు గొంపోయిరా! అట్లయిన మనము వేగము పోవలెన''ని చెప్పి లోనికిబోయి దుస్తులు వేసికొనివచ్చి బల్లపై సిద్ధముగనున్న కాఫీని చంద్రుగారికి కొంతిచ్చి దాను కొంత సేవించిరి. పిమ్మట నిద్దరును కిల్లీలు నములుచు సిగరెట్లుఁ ద్రాగుచు సెట్టిగారి గృహాభిముఖులై సైకిళ్ళపైఁ బోయిరి.

పాఠకులారా! నాగభూషణరావు గారెవరో కొంచెమాలోచింపవలదా!

రావుగారు సుప్రసిద్ధ పత్తేదారు. కులమున బ్రాహ్మణుఁడు. వయస్సు సుమారేబది వర్షములు. ఈయన తనయిరువదియైదవ వత్సరముననే పోలీసుశాఖోద్యోగియై క్రమముగఁ బత్తేదారుగ వచ్చెను. ఈయన మంచిమంచి కేసులలోఁ బనిచేసి గొప్పపేరును సంపాదించెను. రామచంద్రుడు కలకత్తా వచ్చినతర్వాత రావుగారికి కొంతకష్టము తగ్గెను. రిటైరగుటకు సిద్ధముగానుండెను. రామచంద్రువలెనే దయాస్వభావుఁడు. కష్టసుఖములయందారితేరినవాడు. అనుభవించినవాడు. రామచంద్రు కలకత్తా వచ్చినప్పటినుండియిద్దరు నొక కేసులోఁ బనిచేయుచుండిరి. రామచంద్రుని రావుగారి బహిఃప్రాణమని చెప్పియుంటిమి.

సుమారు మూడుగంట లగుసరికి రావుచందు లిద్ద రును సెట్టిగారి గృహముజేరి సైకిళ్లు వీధిలో నేయుంచి సౌధము నెక్కిరి రాజేశ్వరి వీరి నుదితా శీనులం జేసెను. తానొక చాపపైఁ గూర్చుండెను. అంత వారిట్లు సంభాషించిరి.

నాగ—అమ్మా! రాజేశ్వరీ! ఏమి జరిగినది.

రాజేశ్వరి—అయ్యా! నాకుఁదెలియదు. నేను నిద్ర యుందుంటిని. సేవకుని కేకలవలన మేల్కాంచితిని. నే లేచివచ్చుసరికి నాతండ్రి లేడు సేవకుఁడు నేలపై బడియుం డెను అని జరిగినసంగతి నంతయుఁ జెప్పెను. ఇంతలో నేదో సడియగుటచే నందరు మెట్లవైపు చూచిరి. ఒక యువకుడు వచ్చి రావు, చందుల కభివందనము లాచరించెను. అతని జూడగానే రాజేశ్వరి సిగ్గునభినయించుచుఁ గదిలోనికిఁ బారి పోయెను. ఆయువకుని యుచితాసీనుం జేసిన పిమ్మట నందరు నిట్లు మాట్లాడిరి.

రావు—చంద్రాననా! నీవీసంగతి తెలిసియే వచ్చితివా!

చంద్రా—ఏసంగతి? నేను చందుగారింటికి వచ్చి తిని. ఆయన యిటకువచ్చినారని చెప్పుటతోడనే గభాలున నిట కరుదెంచితిని.

చందుగారు జరిగిన సంగతినంతయు జెప్పిరి. చంద్రా ననుని యనుజ్ఞపై రాజేశ్వరి బయటకువచ్చి చాపపైఁ గూర్చుండి చందుగారి కొక చేరుమాలునిచ్చెను. అంత చందు దానిపైనున్న లేఖ నిట్లు చదివెను.

కలకత్తా.
11—4—1918

ప్రియమైన రాజేశ్వరీ,

నీతండ్రియున్న మనవివాహమున కాటంకము గలుగునేమోయని బంధించితిని. నేటిరాత్రియే నిన్ను చెరబట్టి తీసుకొని పోయెదను. తప్పక వివాహమాడెదను ఇదినిక్కము.

ఇట్లు,
నీతండ్రిని బంధించిన,
నీప్రియుఁడు.

ఈయుత్తరము పూర్తియగుసరికి సేవకుఁడు లేచెను. యాతనివలన పూర్వవృత్తాంతమును దెలిసికొనిరి.

నాగ—అమ్మా! రాజేశ్వరీ! మేముండగ నీకేమియు భయములేదులెమ్ము నిన్ను తిగినజాగ్రత్తగ కాపాడియాచోరుని చేతులలోఁ బడకుండఁ జేసెదము.

అని యభయమిచ్చి రావుచందులు మేడదిగిరి. వారి సైకిళ్ళులేవు. అరరే! ఎంతమాయ. అనుచు నొకబండిపై వెడలిపోయిరి.

---

౭

బందితులెవ్వరు

హా! దైవమా! నన్నేలయింకను బ్రతికించితివి. బ్రతికించితివిపో! నా భార్యనేల చంపితివి ? నాకీపమూరికారణ్మం

బనంతగు రాజేశ్వరి నేల ప్రసాదించితివి? ప్రసాదించితివిపో! ఆమె కింకను వివాహమేల చేయనైతివి! నాలలాటలిఖిత మిట్లుండెగాబోలు. దానికేమిచేయువాడను. అయ్యో! నాకీ యాస్తియు, సౌందర్యరాశియు గుణములప్రోవయునగు రాజేశ్వరి యుండబట్టి గదా యీదుర్మార్గులు వచ్చినంతగ బాధించుచుండిరి ఇంతకాలము కష్టపడి గణించిన సొమ్మును చిన్ననాటినుండియు కష్టకష్టములకోర్చి పెంచిన యీ రాజేశ్వరిని నేనట్టిక్రూరులచేతులలో నిడగలను. ఎప్పటికైన యాకృపామయుండగు భగవంతునికి నాపయిఁ గరుణ కలుగకపోవునా? కానిమ్ము నేనీదుర్భరబాధ భరింపజాలను. నేడో రేపో చనిపోయెడివాడనే రాజేశ్వరి భారమంతయు దైవముపై నిడితిని. ఆదైవము సుప్రసిద్ధపత్రేనాథుడగు రావుగారియుల్లముఁ బ్రవేశించి రాజేశ్వరుని రక్షించి నాయాస్తినంతయు నామెకు జేకూర్పడా? అంతయు భగవంతుని చిద్విలాసము. కష్టములు చెప్పివచ్చునా, అని భాగ్యహాముండలి చీకటికొట్టులో నొక వృద్ధుడు వగచుచు తన్నుదానే యోదార్చుకొనుచు తుదకిక మాటాడలేక కూలఁబడెను. అప్పటికి చీకటిగూడపడెను.

నాఁడు చైత్ర శుద్ధపాడ్యమి. చంద్రుడు గగనవీధికరుదెంచుటకు భయమునొందె నోయనునట్లు దయించుట మానెను. నక్షత్రములు మాత్రము పాదరసపుబుడ్లవోలె యాకాశమున మెరయుచుండెను. జారచోరులు బజారులలోఁ

బ్రచారములు సల్పుచుండిరి. అట్టితరి కలకత్తానగర భాగ్య
హాములకును నడుమనున్న యటవిని విద్యుద్దీపకాంతులు కల
కత్తా వైపుఁ బోవుచుండిరి. వారు నల్లనివస్త్రముల ధరించియుంట
చేతను గాఢాంధకారమెల్లెడల వ్యాపించియుండుటచేతను
వారున్నతావు తెలిసికొనుట నొరులకుఁ గష్టముగనుండెను.
కాని, పాఠక మహాశయా! మనకుఁ దెలియకుండ సంచరించు
టకు బ్రహ్మాంతరమా! వారు కలకత్తా జేరి యదృశ్యులైరి.

పాఠకాగ్రణీ! మనరాజేశ్వరిని తీసికొనిపోయెదనన్న
రాత్రియేగదా! ఆమె యెక్కడనున్నదో తెలిసికొనవలదా!
ఆమెను చందుగారింట నొకచీకటికొట్టుయందుంచిరి. ఆమె
వద్దనొక విద్యుద్దీపము మాత్రముండెను. రక్షకభటులందఱ
రను సెట్టిగారింటివద్ద కాపలలా పెట్టించిరి. చందుగారు స్వగృ
హముననేయుండి ప్రతియరగంటకును రాజేశ్వరి సేమమారయ
చుండిరి.

పదకొండు గంటలుకూడ గొట్టిరి. చందుగారు లేచి
రాజేశ్వరి గదిలోనికేగి నిద్దియో మాట్లాడి ద్విచక్రశకటము
పై నెటకో పోయిరి. పాఠకా! చంద్రాననుఁడెచ్చటనున్నా
డని సందియపడుచుంటివేమి, ఆతఁడెప్పుడును చందుగారి
యనుచరుఁడు కాక యాజ్ఞానువర్తి కనుకనే సెట్టిగారింటి
యొద్దనుండి రక్షకభటులను హెచ్చరించుచుండెను. చందు
గారు సెట్టిగారింటికిఁబోయి చంద్రాననునితో నిద్దియో
మాటాడి రావుగారింటికి దారితీసెను. ఆయనట్లు రావుగారి

రొద్దకుఁదోయి ఆయనతో నెద్దియో ప్రసంగించి తిరుగనిం
టికి బోవుచుండెను. రావుగారింటినుండి బజారునకుఁబోవు
సందులోనికి మరలిరి. అంతలో నేరొక గాఢమగు దెబ్బ
సైకిలు వెనుకచక్రమునకు దగులుటయు చందుగారు క్రింద
బడుటయు నొక్కమారు జరిగెను. వెంటనే రెండు గాఢమగు
దెబ్బలు చందుగారికితగిలి మూర్ఛితుంజేసెను. అంతనిద్దరు
వ్యక్తులాతనిని బంధించి మోసికొనిపోయి విలాసమందిరము
నకు సమీపమునన్న చోరభవనములోనికిఁ బోయిరి.
ఆహా! చూడుడు! "మంచికిబోయిన చెడ్డయెదురయ్యెనను"
సామెత చందుగారి యెడసార్థక మాయెను.

చీకటు లెల్లెడల గాఢముగ వ్యాపించియుండెను.
అప్పటికి రొంటిగంటయైనది. చందుగారింట రాజేశ్వరెద్ది
యో యాలోచించుచుఁ గూర్చుండెను. అట్టితఱి నొకవ్యక్తి
రాజేశ్వరిగదిని సమీపించి 'అమ్మా! రాజేశ్వరీ! అపాయము,
లెమ్ము బండి నీకొరకై వాకిట వేచియున్నది! ఆలస్యము
వలద''ని కేకవయిచెను. ఆకేకలకు రాజేశ్వరీ భయకంపి
తయై "చందుగారూ! ఏమి. ఎందులక'' నెను కానియావ్యక్తి
"అమ్మా! చెప్పుటకు వీలులేదు పావకాళముగ చెప్పెదను.
త్వరపడుమ'ని తొందరపెట్టసాగెను. అంత రాజేశ్వరి తొట్రు
పాటున వీధిలోని కరుదెంచి శకటము నధిష్టించెను.

ఆశకటము సెట్టిగారిల్లుదాటి సందు గొందులబడి
అరణ్యమార్గముం బట్టెను. బండివెంట నొక పురుషుడు

నడచుచుండెను. బండికొకింత దూరముననొకవ్యక్తి వారి కగపడకుండ ముందుబోవువారి దీపపు వెల్తురు జాడబట్టి పోవుచుండెను. ఆబండి యట్లుపోయి కుక్కుటములు కూయువేళ కొకచో నాగెను. వెతకవచ్చువ్యక్తియు నొకచోనాగి చెట్టుచాటున దాగెను. బండి వెనుకదారిని బట్టెను. మరికొంత సేపటికొకవ్యక్తి భూగృహద్వారము తెరచి రాజేశ్వరిని లోనికిం గొంపోయెను. ఇదియంతయును చెట్టువెనుకనున్న వ్యక్తికనిపెట్టి ద్వారమువద్దకు వచ్చెను. ఎద్దియో సంభాషణ వినవచ్చెను. చెవియొగ్గి జాగరూకుండై వినుచుండెను. సంభాషణ ముగిసినపిమ్మట లోనున్న వారీవల కరుదెంతురని గ్రహించి వెనుకటిచెట్టుచాటుననే దాగెను. లోపలనుండి యొక వ్యక్తి వెలకువచ్చి యొకమార్గమును బట్టెను. ఆతని కొలది దూరముపోనిచ్చి మొదటి వ్యక్తి వెనుకనేపోయి యొక గ్రుద్దు గ్రుద్దెను. ఇద్దరును ముష్టియుద్ధమునకు డీకొనిరి. రెండవవ్యక్తి నోటితో గట్టిగ నూదెను. ఇంతలో నల్వురు వ్యక్తు లెటనుండియో వచ్చి మొదటివ్యక్తిని బంధించి "ఓరీ! చంద్రాననా! నీవలపులరాణి నీకంటెముందుగనే మాకుచేరినది" అనియరచి యెటకో దోడ్కొనిపోయిరి.

---

౮

గోరుచుట్టుపై రోకటిపోటు

రమారమి పదిగంటలైనది. మెయిల్ టపాలనిచ్చుటకుం బోస్టుజవానులు తపాలాఫీసు వదలిపోవుచుండిరి. అట్టి

తరి నొక మనుజుండు కాకిబొంజాయను కాకికోటును దొడగ గొని తోలుపటాకాను దిగబ్బబడియు ను ఆల్లాం ఘడియ మునకు బ్రేలాడగట్టుకొని నడిచిపోవుచుండెను. ఆతని ను మునుబట్టి యింకొక టపాబంట్రోతుసి కేర చెప్పుకొక్కర లేదు. అతండట్లుపోవుచు నొకచోనాగి మరియొక దిక్కునకు దిరిగి యొక బీటుకానిస్టేబిల్‌తో నెద్దియో మాట్లాడి మరల యథా రీతిని బోవుచుండెను. ఆతండు కొంతదూరము పోయి యొక సందులోనికి మరలి యొక యింటి ముందాగి "నా భూషణ రావుగారూ! అని కేక వైచెను. ఒక సేవకుండువచ్చి తలుపుం దీసి లోనికిరమ్మని చెప్పెను. బంట్రోతులోనికిం బోయి రావు గారికి నమస్కారముచేసి 'అయ్యా! రామచంద్రనగరకిని మీకును చెరియొక యుత్తరము వచ్చినవి. ఆయన వారింటి వద్దలేర'నుచు రెండుత్తరములనిచ్చి సెలవుదీసికొని వెడలి పోయెను. అనంతరము రావుగారు తనకవరును చించి లోపలి యుత్తరమునుదీసి యిట్లు చదివిరి.

కలకత్తా
12—4—1918

సుప్రసిద్ధ పత్తేదారులని పిలువఁబడు నాగభూషణరావుగారికి,
చోరాగ్రేసర చక్రవర్తి వ్రాయునది.

అయ్యా,

గతరాత్రి రాజేశ్వరిని చందుగారిని చంద్రాననుని నా భూగృహమున బంధించితిని. రెండుమూడు రోజులలో రాజే శ్వరిని వివాహమాడితీరెదను. ఇట్లు
శ్రేయోభిలాషి, చక్రవర్తి.

ఈ యుత్తరము ముగించుసరికి రావుగారి నేత్రములెఱ్ఱబారెను. మోము కందెను. శరీరము కంపించెను. కనుల వెంబడి నీరు ప్రవహింపజొచ్చెను. కొంతసేపటికి నూరడిల్లి రెండవయుత్తరమును దీసి యిట్లు చదువసాగెను.

చంద్రనగరం.
10—4—1918

శ్రీరస్తు చిరంజీవులైన తమ్ములు రామచంద్రునకు హేమసింగు పుత్రపౌత్రాభివృద్ధిగా నాశీర్వదించి వ్రాయునది.

ఉభయకుశలోపరి.

నీకిదివరలో నొకయుత్తరము వ్రాసియుంటిని. దానికి ప్రత్యుత్తరము లేదు. చి॥ నాకుమార్తె శశిరేఖకు సంబంధములు వచ్చుచున్నవి. త్వరలో వివాహము చేయవలెను. కావున నీ భార్యాపుత్రులను శశిరేఖను త్వరలో బంపవలెను. సంబంధము నిశ్చయించినవెంటనే జాబు వ్రాసెదను. విశేషములు లేవు.

హించవలెను.

ఇట్లు,
హేమసింగు.

ఈ యుత్తరమును జదివి చంద్రుగారాశ్చర్యపడినవారై 'ఏమీ! చంద్రునాతో దన కుటుంబమును పంపివేసితిననియు అందుచే రాజ్యోని తనయింట నుండెదననియు చెప్పినాడు. ఇంకను చేయనేలేదా!' అని తలపోయుచుండెను. ఇంతలో బడకొండుగంటలు కూడగొట్టెను. అందుచే భోజనముచేసి వచ్చి శయ్యపై గూర్చుండి యొక టెలిగ్రాం ఫారమును వ్రాసి

చేసి యొక సేవకునికిచ్చి యాతనిఁబంపివేసి దీర్ఘాలోచనా నిమగ్నుఁడై పరుండెను. అట్లాలోచించుచు నేనిదురవోయెను.

సుమారు నాల్గుగంటలు కావచ్చినది. కారణ మేరికి తెలియకుండెను. చుట్టుపక్కల వారందరిటకూగిరి. లోనికి కొందరుపోయి వారినూరడించి విచారగ్రస్తులై యున్న …మ సింగుగారిని కారణమడుగ నాయన నిట్లు చెప్పిరి.

'నాతమ్ముఁడు రామచంద్రుడు తనభార్యాపుత్రులను నా యేక పుత్రికయగు శశిరేఖను ఇటకుఁబంపెను. దారిలో నెవ్వడో వారిని మోసగించి నా—శ—శి—రే—ఖ—ను నా తమ్ముని కుమారుఁడగు వీరసింగును దీసికొని పోయిరి. వారలెటనుండిరో తెలియద'నుచు బాలునివలె నేడ్వజొచ్చెను. ఎంతయూరకుండమన్నను ఏడ్పాగుటలేదు. అవును ఎట్లాగును తన యేకైక పుత్రికయగు—తనసౌందర్య రాశియగు—తనగుణముల ప్రోవయగు—శశిరేఖను చోరుల హరించినపుడాతనికెట్లేడ్పాగును. ఇంతలో నొకతంతివార్త బంట్రోతు హేమసింగుగారికి రెండు తంతులువచ్చినవని హేమసింగు గారికి రెండుకవర్లిచ్చి వెడలిపోయెను. హేమసింగొక దాని నిట్లు చదివెను.

హేమసింగుగారు స్టేటు
చంద్రనగరం ఎక్స్ప్రెస్.
కుటుంబము ఇదివరకే పంపెను.
రామచంద్రును దొంగలు బంధించిరి.

నాగభూషణరావు,
డిటెక్టివ్,
కలకత్తా.

12—4—1918.

ఈసరిగ తిదివరకే తెలిసియుండుటచే రెండవదానిని విప్పి ఇట్లు చదివెను.

హేమసింగుగారు — స్టేటు
చంద్రనగరం — ఎక్స్‌ప్రెస్
శశిరేఖ — ఇక్కడ
క్షేమము

ప్రేమసింగు,
విజయనగరము.

12—4—1918

అప్పటికి చీకటిపడుటచే నెవరిండ్లకు వారు బోయిరి. హేమసింగు లోనికిబోయి యాతంతివార్తలను దెల్పెను. శశిరేఖ క్షేమముగనున్నందుల కందరును సంతసించిరి. కాని రామచంద్రు భార్య "అయ్యో! ఈపాడిన స్పెక్టరీ యెందులకు వచ్చెనోగాని ఈ జన్మమున సుఖములేదు. వీరసింగుకై నేనేద్చుచుండ 'గోరుచుట్టుపై రోకలిపోట' నునట్లు నా భర్తను దొంగలు గొంపోయిరన్నవార్త యింకొకటియా!. అయ్యో! నాయనా! కుమారా! నిన్నెపుడు చూతునోయితండ్రీ!" అనుచు వెక్కివెక్కి యేడువసాగెను.

---

మిగులలేదు

నాడాదివారము. వేడిగాడ్పులిగింకను వీచుచున్నవి.

రమారమి మూడుగంటలయినది. ఇంతలోక గంటముస్నే వచ్చియుండిన మొయిల్ టపాలనిచ్చి వేయుటకై తపాలబంట్రౌ లపుడేపోస్టాఫీసు వదలిపోవుచుండిరి. అందులో నొకబంట్రోతు భాగ్‌బజారుకుబోయి కొందరకు త్తరములిచ్చు చుండు రు నాల్గు గంటలకొక సందులోనికి మరలి యొక యింటియొద్దాగి "అయ్యా! నాగభూషణరావుగారూ!" అని కేకవై చెను అంతనొక సేవకుడువచ్చి తలుపుదీయ నాతనికొక కవరు నిచ్చి వెడలిపోయెను.

నాగభూషణరావు గారప్పుడే కాఫీద్రాగి చావడిలోని కుర్చీపై గూర్చుండి యెద్దియో దీర్ఘాలోచనలో మునింగి యుండెను. అంతలో నిసేవకుడా యుత్తరమును గొనిపోయి కిచ్చెను, రావు గారది చూడగనే యానందసమనం ఉల్లాస పూరితమయ్యెను ఏమన అదియొక శుభలేఖయని చూడ గనే తెలియుచున్నది. అందుచే నాకవరును చించి యందుగల శుభలేఖయందిరియొక యుత్తరమునుదీసి శుభలేఖ నాంతము గచదివెను మరలచదివెను ఇట్లు చదివినకొలంది నాత నికి భయాశ్చర్య సంభ్రమములుపొడంగ సాగెను ఆ శుభ లేఖ యేమన:-

శ్రీరస్తు శుభమస్తు

—♦ వివాహ మహోత్సవాహ్వాన పత్రిక ♦—

ఉ॥ శ్రీయును శ్రీధరుండు శశిశేఖరు డాతనిధర్మపత్నియున్
తోయజజుండు భారతియుతోయమువిూరగ సర్వభోగ భా

ఈశుభలేఖను జూచి రావుగా రత్యాశ్చర్యమునొందిరి. ఏమిసేయుటకును పాలుపోవుటలేదు. ఇట్లాలోచించుచు కూరు చుండెను. ఆహా! యేమి! ఈచోరుని ధైర్యసాహసములఁ బ్రష్టి కుగా తెలియపరచి మరియు నామెను చేపట్టుచుండెను. ఇంకు లకు రాజేశ్వరియ్యకొనునా! తప్పక యియ్యకొనును. లేకు న్న వీడుమాత్ర మెట్లు వివాహమాడును. ఆ! ఏమి! కాదు కాదు. ఆమె కంఠమందుఁ బ్రాణమున్నంతవరకు వాతని వివాహమాడుట కలలోనివార్త. ఈవివాహ మాటంకపఱచుటకు నేనటకువత్తుననియు అపుడు నన్నుకూడ బంధింపవచ్చుననియు తలంచి యిట్లువ్రాసి యుండనోపు. అంతియగాని వేరొండు గాదు. ఈసమయమున నేమిసేయుటకును దోచకున్నది. నేనుకూడ పట్టుబడితినా వివాహము నిరాటంకముగా జరిగి తీరును. ఇంతియగాక తానుచేయదలంచుకొనిన పనులన్నియు జేసినగాని మమ్ములవిడిచిపుచ్చడు. పోని! నేవెళ్ళుటమానిన యెడల వివాహముజరిగిపోవునేమో! రాజేశ్వరి ష్టపడకున్న బలవంతముననైన పుస్తెకట్టితీరును. నేనుపట్టుబడకుండనున్న నేడుగాకున్న రేపైన మనవారిని చంపించి వాని కార్యక్రమ మునడ్డుదూరగలను. అని యాలోచించుచు రెండవకాగిత మును దీసి యందుండిన యుత్తరము నిట్లుచదివెను.

కలకత్తా,

14—4—1918.

బ్రహ్మశ్రీ నాగభూషణరావుగారికి,

చక్రవర్తి నమస్కారములు.

అయ్యా !

ఈశుభ లేఖలోని యంశములు నిజములుగావి యసత్యములుగావు. మీకు మగతనమున్న యెడల, పత్తేదారులైనచో వివాహము ఆపుజేయవచ్చును. వివాహము నిజము.

ఇట్లు,
చక్రవర్తి అనే
భీమానందుడు

రావుగారీయుత్తరమును ముగించి హాలులోనికి వచ్చుసరికి నొకయువకుఁడరుదెంచి 'బాబూ! మమ్ము చాలాకాలము నుండి పట్టపగలే దోచుకొనుచున్నారు. నేడు మాయింటి కిద్దరు చోరులువచ్చి కన్నము త్రవ్వుచుండ నేను వారిని బంధించి తమకొఱకై వచ్చితిని. బండితీసికొనివచ్చితిని. తమరు దయచేయవలయు'నని దీనముగాఁ బలుకజొచ్చెను. వెంటనే రావుగారటనున్న సేవకుని కెద్దియో రహస్యమాది వీధిలో నున్న బండినెక్కిరి. ఆబండి మనకు పరిచయమగుచోర భవనముంజేరెను. రావుగారును యువకుఁడును లోనికేగి కుర్చీలపైఁ గూర్చుండిరి. అందయువకుడు 'అయ్యా! తమరిపు డెట నున్నారో తెలియునా!' అనెను.

రావు—ఏమీ ! మీయింటగాదా !

యువ—ఔను. నేనెవరినో యన్నమాట.

రావు—నీవెవరైన నాకేమి. చోరు లెటనున్నారో చెప్పుము.

యువ — నేనే చోరుఁడను. మీతో కొన్ని రహస్యములు మాటాడవలసి యిటకుఁ దోడ్కొని వచ్చితిని.

రావు — ఏమీ యా రహస్యములు.

యువ — మీరు వయోవృద్ధులగుటచే మిమ్ము బాధించుట యుక్తముగాదని నయమున చెప్పజూచి యుత్తరములు వ్రాసితిమి, గాని మీరు మీ సహాయములును మానలేదు. ఇప్పటినుండియైన మానెదనని శపథము చేసిరేని వెంటనే విడచిపుచ్చెదను.

రావు — నేను మానదలచుకొనలేనప్పుడు శపథమేమని చేయవలెను.

యువ — మిమ్ముకూడ బంధించమనెదరా !

రావు — మోసగించినవాడవు బంధించకమానుదువా అనుచు లోపలిజేబునందు పొందుపరచిన పిస్తోలునకై చేయిని చొక్కాలోనికిఁ బోనిచ్చెను. గాని ఇంతలో నాచోరుఁడు లేచి తలుపు తెరచి రావుగారు నందుత్రోసివైచి తలుపును బిగించి 'ఇక నెవ్వరును మిగులలేదు' నిర్భయము. అని యనుకొనుచు నటకో పోయెను.

---

## ౧౦

### అభయమిచ్చినదెవ్వరు ?

సూర్యుఁడు పశ్చిమాంబుధి గ్రుంకెను. కొలది కాలములోనే చంద్రోదయముకూడ నయ్యెను. ఆకసము నిర్మేఘమై

యుంటచే నందు మిన్కుమిన్కుమని ప్రకాశించు నక్షత్రములతో నీలిరంగుచాయపై తెల్లచుక్కలున్న చీర ధరించిన యువతివలె రాజిల్లుచుండెను. చంద్రకాంతిలోనికి జొరక పోయినను భూగృహమంతయు విద్యుద్దీప పరిసారంబులచే నెంతయు కాంతివంతమగుచుండెను.

అట్టితరి భూగృహమునందలి నారసపుగదులలో నొక దాని యందిద్వరు స్త్రీలిట్లు సంభాషించుచుండిరి.

ఒకవనిత—అమ్మా! రాజేశ్వరి! ఇదిగో నీకాహారము గొనివచ్చితిని. భుజింపుము.

రాజే—నేడేలకో నామనంబు విచారగ్రస్తమై యున్నది. నాకించుకేనియు యాకలిలేదు.

వని—ఏమమ్మా! రేపు నీకు వివాహముకూడను, ఎందుకీ విచారము.

రాజే—ఛీ దుర్మార్గురాలా! ఏమిపలుకుచుంటివి.

వని—అమ్మా! కోపపడకుము. నీకు రేపు వివాహమని శుభవార్త దెల్పినను తప్పేనా ?

రాజే—అదియే యునవార్తంటివి. మరల నదియే యందువేమి?

వని—అమ్మా ! మాసంఘములోని వారనుచుండ వినినేనంటిని.

రాజే—ఎప్పుడని.

వని—రేపుశయమని. ప్రయత్నములుకూడ జరుగుచుండెను.

రాజే—ఎక్కడని.

వని—కాళికాలయములో

రాజేశ్వరి స్వరము దిగజారుచుండెను. చివరకు ఏమి! నీపల్కులు చిత్రములుగా నున్నవి. అనెను.

వని—అమ్మా! విచిత్రములు కావు. రేపుదయమొనిమి దిగంటలకు మాయబచూనియగు భీమానందునకు నిన్ను వివాహముచేసి మారాణిగా చేయుదురు.

రాజేశ్వరి యామాటలువిని గోలున నేడ్వనారంభించెను. ఈ యేడ్పు జూచినతోడనే యావనితహృదయము కరిగి కన్నులవెంట గారుచుండెనాయనునట్లు యశ్రుధారలు జలజలరాలెను. అంత నావనిత 'అమ్మా! నిన్నురక్షించగల వారెవ్వరును లేరా! నిన్నుజూడ నాకెంతయుఁ జాలివొడముచున్నది'అనెను.

రాజే—ఈ విషయము తెలిసినచో రామచంద్ర చంద్రాననులు నన్నుతప్పక రక్షించెదరు.

వని—వెఱ్ఱిదానా! వారలెక్కడనున్నారను కొనుచుంటివి. ఈగృహమందే బంధితులైయున్నారు.

రాజే—అయ్యో! అట్లైన నా కర్మము కాలవలసినదేనా!

వని—అమ్మా! నేనొకయుపాయము చెప్పెదను. ఈయెదుగరు కొట్టుగదులలోనే వారును యున్నారు. ఇందుండి యాగదుల

లోనికిఁబోవుటకు మార్గమున్నది. నేటిరేయి చాలరాత్రి వర కంటకును మెలకువగ నేయుందురు కాన నేనీ నారసముల కడ్డ ముగ నొకచాపను గట్టింతును. ఆమార్గము నీకుఁదెలిపెదను నంతలో నెవ్వరో యామెను పిల్చినట్లు వినబడుటచే మరల వత్తునని చెప్పి వెడలిపోయెను. రాజేశ్వరి యాలోచనానిమ గ్నయై యావనిత యుదారస్వభావమున కెంతయు సంతసిం చుచు కూర్చుండెను. ఇంతలో నిద్దరు వ్యక్తులొక బండి చాపనుదెచ్చి రాజేశ్వరియున్నగది నారసముల కడ్డముగ గట్టిరి. రాజేశ్వరియు వెనుకటి వనితరాకకు నిరీక్షించుచుం డెను. ఇంతలో నొకగంట గణగణమని మ్రోగెను. అదివిని యామె 'అయ్యో! ఇప్పుడు భీమానందుని యనుచరులు పనులుమానివేయుటకై గంటకూడ కొట్టబడినది. కాన నిప్పుడు పదిగంటలైన దన్నమాట. ఇక నావనిత రాదు. అది స్పష్టము. తెల్లవారిన నాబ్రతుకు వ్యర్థము. కాననీరాత్రియే నానాథుని గలసికొనవలెను. మార్గ మెక్కడనున్నదో గదా యని నల్దెసల పరికించెను కాని లాభము లేకపోయెను. ఇక లాభములేదని యొకగోడకు జేరబడెను. అంతనొక మేకు వీపుపై గ్రుచ్చుకొని యాసుకుమారి కెంతయు నెప్పిగల్గిం చెను. కాని వెంటనె యాగది మధ్యనొక రంధ్రమేర్పడుటచే దనకు గల్గినబాధను సరకుఁగొనక యామార్గముంబట్టెను. అట్లుకొంత దవ్వరుగుసరి కొకతల్పుగన్పడెను. దానినిదీయ విశ్వప్రయత్న మొనరించెను. గాని విఫలమయ్యెను. తిరిగి

వెనుకకు బోవుచుండ నొక గొలుసామెకుఁ దగిలెను. అది లాగిన నేమైన యుపకారముండునేమోయని ప్రయత్నించెను. గాని సామర్థ్యము కాలేదు. అందుచే యథారీతిని వెనుకటి గదిం బ్రవేశించెను. ఆమార్గము మూయనెంచి వెనుక తనకు గుర్తుకొనిన మేకును పైకిలాగెను. సొరంగ మార్గము మూయబడెను.

అప్పటికి చాలరాత్రియైనను నిత్యము నార్పివేయ బడు దీపములు నేడింకను ఆర్పివేయబడియుండలేదు గది నారసములకు చాప యడ్డముగట్టబడి యుంటచే గదిలో వెల్తురు లేక పోలేదుగాని రాజేశ్వరి పైనున్నవారును పైను న్నవారికి రాజేశ్వరియు కన్పడుటలేదు. రాజేశ్వరి కిదివరలో హత్యాపరాధ పరిశోధకనవలలఁ బెక్కు చదివియుంటచే మార్గము లేవియైననుండునని యెంచి తాను జాగ్రత చేసి యుంచిన విద్యుద్దీపమును వెలిగించి చూచుసరికి నారసము లకుగట్టిన చాపకన్నములోనుండి యొక కాగితము క్రింద పడెను. ఆకాగితమునుతీసి యామెయిట్లు చదివెను.

అమ్మా.

తూర్పువైపునగోడకు నేలనుండి రెండడుగులయెత్తున నున్న గొలుసును లాగుము మార్గమేర్పడును.

ఇట్లు,

వనిత.

ఈయుత్తరమునకు నామె యెంతయు సంతసించియు త్తరమున చెప్పబడినట్లొనర్చెను. ఒకసారంగమార్గ మేర్పడెను. ఈమె దానిగుండా చూచుసరికి సోపానములు కన్పడెను. ఆ సోపానములు దిగుచుఁ బోయెను. ఈమెకొక చిత్రము గన్పట్టెను' ఈమె లాగినగొలుసు దిగుచుండగనే సోపానములు ప్రక్కకుజారెను. ఈమె సోపానములు దిగుటపూర్తి యయ్యెను. మూఁడుగజముల దూరము క్రిందనడచెను మరల సోపానములెనురయ్యెను. ఆమె సోపానారోహణము సేయసాగెను. మరొకవింత. ఒకగొలుసు పైకిఁబోవుచుండెను. రాజేశ్వరి యత్యుత్సాహముతో తన యూహాప్రపంచమున సంశయముల ఛేదించి యాగొలుసును క్రిందకులాగెను. ఒక రంధ్రమేర్పడెను.

ఆరంధ్రముగుండా నీమె పైకిఁబోయెను. ఈచీకటి మార్గములన్నియు దాటివచ్చుటకు విద్యుద్దీపమే శరణమని యూహించుటలేదా పాఠకా! ఆమె యాగదీ యందొక పురుషుని గన్గొనెను. అతఁడు గాఢనిద్రమునింగియుండెను. తన విద్యుద్దీపసహాయమున నాతఁడు చంద్రాననుఁడేయని తెలిసికొనెను. 'ఆహా! ఆకలి రుచియెరుగదు, నిద్ర సుఖమెరుగదన్నట్లు' అతని నాకటికి నేలపై నిద్రయెట్లు వచ్చెనాయని యచ్చెరువొందెను. రాజేశ్వరి యాతనిపిలుచుటకు సిగ్గుజెందిన లాభములేదని దగ్గరకుఁబోయి 'ప్రాణప్రియా! ప్రాణప్రియా!' అని పిలచెను. ఆపిలచునపుడొకటి రెండ శ్రుకణములా

యువకుని శరీరముపైఁబడ దిగ్గునలేచి 'ఎవఁడువాఁడ'నెను. రాజేశ్వరియు 'నేన'ని మెల్లగనెను కంఠధ్వనిని గుర్తించి యువకుఁడామె నొక్కసారి గాఢాలింగనమొనర్చి యామెవలన యావద్వృత్తాంతములు దెలిసికొని యామెకభయమొసగి యామెగదికిఁ బొమ్మనెను. 'జాగ్రత! జాగ్రత!!' అనుచును రాజేశ్వరి వచ్చినదారి వెంటనే తన గదికింబోయి నిద్రలేక యలసియుంటచే గాఢసుషుప్తింజెందెను.

---

## ౧౧
## ప్రేమ

తెల్లవారుసరికి భూగృహమంతయు 'నిత్యకళ్యాణము పచ్చతోరణము'నునట్లెటుజూచినను కడురమ్యముగ నలంకరింపబడియుండెను. భూగృహమునకువచ్చు మధుసపుత్రా విశ్లేషుఁ దెరపిలేకుండెను. గృహమునందెటుజూచినను జనసంచారమే. వేలైనప్పుడెల్ల మధురసముం గ్రోలుచుఁ దూలుచు నిచ్చవచ్చినరీతిఁ బర్విడుచుండిరి. భీమానందుఁడు పెండ్లికుమారుఁడుగ చేయబడెను. చక్కనిదుస్తులతో నలంకరింపబడెను. ఆయలంకారములతో భీమానందుఁడు రాజేశ్వరి గదియొద్దకేగి గడచినరేయి కట్టించినతడకను విప్పించి లోనికేగి 'ప్రేయసీ!' అని పిల్చెను. రాజేశ్వరి మాటలాడక తలవంచుకొనియూరకుండెను. భీమానందుఁడు 'ఓ యువతీలలామా! నేఁడే గదా మనవివాహము. విచారమూ హాయిగనుండుము' అనెను.

రాజేశ్వరి క్రోధపూరిత మనస్కురాలై 'ఓరీ దుర్మతీ! పలుకు మాటలు సరియైనవిగా నుండవలెను. నీయిచ్చవచ్చినట్లు ప్రేలక యూరకుండుము' అనెను. భీమానందుడు 'చెలీ! నన్ను చేపట్టవా!' అనెను. రాజేశ్వరి 'ఓరీ క్రూరా! నీవికట నవ్వు గట్టిపెట్టుము. ఎన్నన్నటికి చేపట్టను' అనెను.

భీమా—నీతండ్రినిజంపి నిన్ను బలవంతముగ వివాహ మాడిన నేమి సేతువు.

రాజే—నీశక్యముగాదు.

భీమా—నీతండ్రిని జంపనిచ్చగింతువా ?

రాజేశ్వరి మౌనముద్రవహించి యూరకుండెను. భీమానందుడతికోపమున 'ఓరీ! సేవకా! ఆసెట్టినిటుదెమ్మనుటయు నొక గడియలో సెట్టితో నిర్వురు ప్రవేశించుటయు జరిగెను. అంత భీమానందుడు సేవకునియొద్దనుండి కత్తినొకదానినిదీసి కొని సెట్టి కుత్తుక వేసి వెడలిపోయిరి. గదియంతయు రక్తమయమయ్యెను. రాజేశ్వరి మూర్ఛిల్లెను.

మరొకగంట కొకవనిత యరుదెంచి రాజేశ్వరీ! లెమ్ము వివాహపువేళ యతిక్రమించుచున్నది. ఇదిగో యీ క్రొత్త చీర గట్టుకొమ్ము' అనిలేపెను. రాజేశ్వరి లేచిచూచుసరికి తండ్రిశవము చటలేదు. ఎట్టయెదుట నీవనిత చీరతో సాక్షాత్కరించెను. రాజేశ్వ రాచీరనుధరించెను. పాఠకా! రాజేశ్వరి విచారకారణము తండ్రిమృత్యువో లేక తనకాబోవు వివాహమో యూహించలేరా! సుమారేడున్నరగంటలయ్యెను.

అందుచే నందఱును కాళికాలయమునకుఁ బోవ పయన మయ్యిరి. వారొక సొరంగముం బ్రవేశించిరి ముందు సుమా రొక యేబదిమంది తూలుచు నడచుచుండిరి. వారివెనుక కృష్ణారావు భీమానందులు హాయిగ కాలక్షేపముఁ జేయుచు బహుకీనిగ నడచుచుండిరి. వారిముఖముల సంతసము మూర్తీ భవించినట్లుండెను వారికొకింతదూరమున రాజేశ్వరి నిర్వురు వనితలు చేయూతనిచ్చి తీసికొనివచ్చుచుండిరి రాజేశ్వరి విచా రముఁ డిగియుండెను. ఆ కారణమున నామె భీమానందుని వివా హమాడుట కిచ్చగించెనని యందఱభిప్రాయపడఁ జొచ్చిరి. పాఠకా! వివాహప్రయత్నములిట్లు జరుగుచుండినను చంద్రా ననుఁడింకను బయటకు రాలే దేమియని తత్తరపడుచుంటివా? వలదు వలదు. తన ప్రేయసినింకొకరు వివాహమాడుచుండు నపుడతఁ డెట్లూరకొనును. ఆహా! ప్రేమప్రభావము! చూడు డు తాను రాజేశ్వరిని ప్రేమించుటం జేసి సరిగ వేళకు దిండి లైనతినక యామెకొరకై పడరానిపాట్లుపడుచు తుదకు దొంగలచే బంధితుఁడుగ కూడ గొంపోబడి యిట్టిసమయమున యుపేక్ష చేయునా! తాను చేయ సంకల్పించుకొనకున్నను చేయించునది ప్రేమ—ఆతఁ డందువలననే రాజేశ్వరి తన్ను వీడినది మొదలు సాధనోపాయ మాలోచించుచుగ నంతయు కలయదిరుగుచు మీటలెందైన నుండెనేమోయని వెదకుచుం డెను. కొంతసేపటికాతఁ డొక మీటసహాయమున నొకమార్గ మేర్పరచుకొని బయటపడి యొక సొరంగమార్గముంబట్టెను.

కొంతదూరమేగుసరికి నొకవ్యక్తిచేత పిస్తోలుతో నాతకెదురై తూలుచు నడచుచు 'ఓగోరు' అనెను. చంద్రానందుడాతని వైఖరిచూచి తప్పత్రాగియుండెనని గ్రహించి ఒకత్రోపున నాతని పడద్రోసి యాతనియొద్దనున్న పిస్తోలుగైకొని తన మార్గమున బోయెను

మరికొంతసేపటికి భీమానంద కృష్ణారావు లనుచరులతో నీవలకు వచ్చిరి. అనుచరులందరు కాళికాలయమునకు పాతికగజముల దూరమున నుండిరి భీమానంద కృష్ణారావులును రాజేశ్వరియు నామెతోనున్న వనితలునుగాత్రము లోనికేగిరి. పిదప బోవుచు కటనొక బ్రాహ్మణుడు పెండ్లి పీటవేసి ముక్తాలుగ్గిన్నెలు సిద్ధముచేసినాడు. మొక తాంబూలమును భీమానందుడు మంగసూత్రధారణమునకై లేచి రాజేశ్వరి కెదురుగనిల్చి మంగళసూత్రమును జేబూని. కట్టుటకు సిద్ధముగ నుండెను. ఇంతలో ప్రేల్చుటకు సిద్ధపరచి యుంచబడిన రివాల్వరుతో నొకయువకుడు సాక్షాత్కరించి భీకరస్వరమున 'భీమానందా! నీచా! పాపీ! నీచేయునామె మెడపరికిఁబోనిచ్చితివా నీతల వేయిచక్కలగునని గుర్తెరుంగుము దూరముగపొమ్ము' అని యనుచుండగనే ఢాం! ఢాం! అని ధ్వనియయ్యెను. గుడిలో భాగమంతయు పొగచేనింపబడెను. మరల యువకుని చేతిలోని రివాల్వరు ఢాం! ఢాం! ఢాం! ఢాం! ఢాం! అని ఐదుసార్లు ప్రేలెను. ఈకలవల మంతయుజూచి వెలుపలనున్నవారు సాహసముతో గుడిలోనికి

పోయిరి. కాని ఎక్కడనుండివచ్చిరోగాని పోలీసుదళము రివాల్వరును ప్రేల్చుటనారంభించిరి. దొంగలయొద్ద నాయుధములేమియు లేవు. అందుచే వారు కాళ్ళకుబుద్ధి చెప్పిపారిపోయిరి. కొంతసేపటికి పొగతగ్గెను. యువకుఁడు చూచుసరికి రాజేశ్వరి తనపాదములు గట్టిగ బట్టుకొనియుండెను. ఆమెను లేవదీసి గాఢాలింగన మొనర్చికొని యామెతోఁ బయటకువచ్చెను. అటనెవ్వరును లేరుగాని తనరివాల్వరు దెబ్బచేహతులైన నల్గురుయనుచరులయొక్కయు వివాహము చేయించుటకై వచ్చిన విప్రునియొక్కయు కళేబరములును పోలీసుదళము మాత్రమటనుండెను. కాని రావుగారు లేరు. పోలీసువారివలన రావుగారు గతదినమున నెటకోగొంపోబడిరనియునిప్పటివరకు రాలేదనియు తెలిసికొని యాయనకూడ బంధింపబడి యుండురని తలంచి రాజేశ్వరితోఁ గలకత్తాజేరెను.

—*—

## ౧౨
## హత్య

తెల్లవారుచున్నది. పక్ష్యాదులు తమతమగూండ్లవిడిచి యాహారార్థమరుదెంచుచున్నవి. నాఁడేలకోనాసమయమునకు జిరపరచితమగు భాగ్యగృహమంతయు చిన్నవోయియున్నది. నిత్యము దెల్లవారుసరికే శుభ్రముసేయుపడుభాగ్యగృహము నేడట్లే యున్నది. ఒక్కమనుజమాత్రుఁడైన నటగాన్పింప కుండెను. అచ్చటచీకటికొట్లులలోనొకదానియందొక యువకుఁడులికిపడి

లేచి నాల్గువైపులను బరికించిచూచి నేమియుంగానక యొక గోడకుఁ జేరి నిలుచుండెను ఏమి—నీరు—దారి–రాజేశ్వరి— బాధఅను యస్పష్ట వచనములెవ్వియో వినబడుచుండెను. మధ్యమధ్య నేడ్పుకూడ విననగుచుండెను. అట్లు గోడకుజేరి యుండి యస్పష్టవచనములు వినుచుండగనే కాళ్ళకుఁదడియయ్యెను. ఇదియేమి! ఈతడి యెట్లువచ్చినది' అని క్రిందికి చూచుసరికి పాదములుతడిచెను. చూచుచుండగనేమోకాళ్ళ వరకు నీరువచ్చెను. అతనికేమియు బోధపడలేదు. గది యంతయు చీకటికోణమగుటచే నీరువచ్చు దెసయైనను దెలిసికొన జాలకుండెను. కొలదిగనీటిని తన పుక్కిటితోదీసి చవి చూచెను. నీరు చాలరుచిగనుంటచేనవి తప్పక హుగ్లీనదీ జలంబులని నిశ్చయించుకొనెను. అప్పటికినీరు తొడలవరకెగఁబ్రాకెను. ఇకయాలోచించిన లాభములేదని సాధనోపాయ మాలోచించుచుండఁ దలవనితలంపుగనొక మీటయాతనిచేతికి దగుల్కొని యూడువచ్చెను. వెంటనేయొక రంధ్రమేర్పడెను. అది తనకందియుంటచే యువకుఁడది యెక్కగలైను. కాని కూర్చుండుటకు సరిపడు ఖాళీలేదు. రెండవ ప్రక్కకు తొంగిచూచెను. కాని అదియు చీకటికోణమే. అందు వెనుకటివలెనే కొన్నిమాటలు వినబడుటంజేసి యందెవరో నుందురని గ్రహించి యందుఁబ్రవేశించెను. అందును నీళ్లున్నవి. నీటిలో నొకవృద్ధుడు గజగజ వడంకుచున్నట్లాతఁడు కనిపెట్టి యాతని నెట్లైన రక్షించు నుద్దేశముతో నాతని

చేయిపట్టుకొనెను. అంతనావృద్ధుఁడాతని చూచి 'నాయనా! నీవెవ్వరవో ప్రత్యక్షదైవమవోలె సాక్షాత్కరించితివి నన్నీయాపత్తునుండి తప్పింపుము' అనుచు నేడువసాగెను. మన యువకునకు దారికాన్పించుటలేదు కాని యిదివరకొకమాట నెరింగినవాఁడగుటచే నిట్టివెందైన నుండగలవని దృఢనిశ్చయుండై గోడందడుముచుండెను. ఆతని బుణ్యా మేమోగాని అనుకొనినరీతి నొకమాట గాన్పించెను అద్దానినతఁడు లాగఁ బ్రియత్నించెను. కాని విఫలమనోరథుండై లాగుటమాని గట్టిగనొక్కెను వెంటనేయొక పెద్దవెల్తురు లోనికిజొచ్చెను యువకుఁడా వెల్తురుజొచ్చు దొకరంధ్రమని గ్రహించి దానిం బ్రవేశించి వృద్ధునిగూడ రక్షించెను! వారువచ్చిన ప్రదేశము. బంగాళా ముండలి కాళీ ప్రదేశము యువకుఁడు వృద్ధునివైపుజూచి మీరా సెట్టిగారూ! మిమ్ముల గన్పట్టజాలనందుకు, క్షమింపుడు. మనము త్వరగ నావలకుఁ బోవలెను. త్వరగరండు. అనుచు సెట్టిగారిని చేయిబట్టుకొని తీసికొనిపోవుచుండెను. సెట్టిగారు బాబూ! మీరాచందుగారూ! మీరువచ్చుటఁ బట్టి నేను బ్రతికితిని లేకుంటే నేనీసరి దివమలంకరించియుందుననెను. ఆహా! కష్టములపై కష్టములనునట్లు వీడునడుచుచుండగనే రొయొక పెద్దతలుపు నిలువున చందుగారికి సెట్టిగారికిని నడుమబడుటచే నిర్వురకు నెడబాటు గల్గెను. ఎవ్వరేమగుదురో!

*   *   *   *   *

క్రమముగ పదిగంటలు దాటెను మెడ్రాసుమెయిల్ బయలుదేరు వేళయయ్యెను. కలకత్తాస్టేషనుకుం బోవుగుఱ్ఱపు బగ్గీలకును ట్రాంకార్లకును ప్లషరుకార్లకును తెరపిలేకుండెను. కార్ల బుర్రుబుర్రు శబ్దములు బండ్లవారి 'తప్పుకో!' యను కేకలను మిన్నుముట్టనీయక నాటంకపరచుచుండెను. పాదచారులకు లెక్కయే లేదు. భోజనశాలలోని జనసంఖ్య లెక్కలేకుండెను. భోజనమునకుం బోవువారు కొందరును భోజనములు చేయువారు కొందరును భోజనముచేసి వచ్చువారు భోజనశాలలు చాల కిక్కిరిసియుండినవి. భోజనశాలల మేనేజర్ల Cash Boxes చిల్లరతో నిండుచున్నవి ఆభోజనము చేసి వచ్చువారిలో నొకదీర్ఘకాయుఁడుండెను. ఆతఁడు రోడ్డుపైఁ బోవుబండ్లన్నియు పరిశీలించుచుండెను. అట్టితరి బండిగూడంతయు చక్కని రంగురంగులతో నలంకరింపబడిన గుఱ్ఱపుబగ్గీ యొకటి కలకత్తాస్టేషనువైపు బోవుచుండెను. ఆబండిలో నొకమనుజుఁడుండెను. ఆతఁడొక తెల్లనిమల్లు పంచను వెనుకకు విరిచికట్టి చొక్కాను దొడగికొనిదానిపై నొక కశ్బాను ధరించి మోకాళ్ళవరకు వ్రేలాడు నొకనల్లని కోటును వేసికొని తలకొక గులాబిరంగుగలగుడ్డను తట్టతల పాగచుట్టి కాలికొక ఛడాపును తొడగికొనెను. అతనిప్రక్కనొక వెండితొడుగుబెత్తముండెను. కోటుబొత్తములు విప్పియుండుటచే లోనధరించినదుస్తులు విపులములగుచుండెను. అతని చెవులనుండి లావుపాటి బంగారుకాడలు వ్రేలాడుచుం

డెను. ఈవైఖరిజూడ యాతడొక మార్వాడీయని స్పష్టమగు చుండెను. ఆబండి కలకత్తాస్టేషను జేరగనే యాతడద్దాని నుండి దిగి Booking office లోనికిబోయి 'విజయనగరమున' కొకఫస్టుక్లాసుటిక్కట్టును దీసికొని '1 st & 2 nd class Gentlemen Waiting Room' అని బల్లకట్టబడియున్న గది లోనికిఁబోయి యొకకుర్చీపై నాసీనుడయ్యెను. టిక్కెట్టు కలెక్టరు గేటువద్దనుండి ప్రయాణీకులను ప్లాట్ ఫార్మ్ లోనికి వదలుచుండెను. ఇంతలో మెయిల్ ఫస్టులయిన్ లోనికివచ్చి యాగెను. ఏతరగతి వారాపెట్టెల నెక్కుచుండిరి. మన మార్వాడీయు గదివీడి ఫస్టుక్లాసు పెట్టెలో నెక్కెను. ఫస్టు బెల్ కొట్టిరి. బండినెక్కువారి యడావిడి యధికముగుచుం డెను. మన మార్వాడీ తనజేబు గడియారమునుదీసి రైల్వే టైము ఐదునిమిషములు తక్కువ పదకొండు గంటలగుటచేఁ దన టైముకూడ నంతకు సరిగామార్చెను. మిగత యైదునిమి షములుకూడ పూర్తియయ్యెను. సెకండుబెల్ కొట్టిరి. గార్డు బిగిల్ నిచ్చెను. కదలుట తడవుగ ప్లాటుఫార్మ్ పై పచారు చేయు షోకేలాలుబండితో కొంతదూరము పర్వెత్తి బండి నెక్కిరి.

బండి కదలినకొంత సేపటికి మనమార్వాడీనిదురవోయెను ఇరువదియైదు నిమిషము లగుసరికి మెయిల్ మరొక స్టేషనులోనాగెను. మార్వాడీలేచి కూర్చుండెను. ఇంతలో సాతిక ముప్పది వర్షముల యువకుఁడొకడు తెల్లని చలువవస్త్రములఁ

దాల్చిముఖములో గోటును దొడగికొని చేతనొక బెత్తముపూని తిన్నగ మన మార్వాడీయున్న పెట్టెనెక్కెను. అరగంట యగుసరికి బండికదలెను. వెంటనే మార్వాడీ, ఏమండీ ఎక్కడనుంచి? ఎంతదనుక అని యా క్రొత్తమనుజునితో ననెను. క్రొత్తమనుజుడును 'ఇదిగో ఘోష్ చందుగారా! ఎక్కడకు బోవుచున్నారు. అనియెను.

ఘోష్—చిత్తము. విజయనగరము పోవుచుంటిని. మీరుకూడ వచ్చుటకేయని తలంచెదను.

క్రొత్తమ—చిత్తము. విశేషములేమి!

ఘోష్—ఏమియునులేవు తమపేరు భీమశంకరరావు గారుకాదా!

క్రొత్తమ—అగును. మరచిపోయినట్లున్నారు.

ఘోష్—లేదులెండి. కానిత్వరగా స్ఫురణకురాలేదు. మీరుపెట్టెలోనికి రాగానే పరిమళ మారంభమైనది ఏమది?

భీమ—నాకుఅత్తరులనిన ప్రీతిమెండు అందుచే నెప్పుడు నొకటిరెండుసీసాలు నావద్దనుండును. అనుచునే యాతడు రెండుసీసాలనుదీసి నాతనిపై జల్లెను. కొలదికాలములోనే యాతడు గాఢనిద్రమునింగెను. భీమశంకరరావుగారును మరికొంత సేపు కాలయాపనచేసి తనజేబునుండి యొకపచ్చనిచేరుమాలు తీసి మార్వాడీ నాసికారంధ్రముల యొద్దనుంచెను. పిమ్మట తనచేతిని మార్వాడీకబ్బాలోనికిఁ బోనిచ్చి యొకకట్టను దీసి చూచెను. అదికరెన్సీనోట్లకట్ట. అవి జేబునందు పొందుపర

చెను. తన జేబునందు రహస్యముగ దాచియుంచిన డేగరు (Dagger)ను దీసి సిశ్చేష్టుండై పడియున్న మార్వాడీ బట్టలను దొలగించి గుండియలపై నొక్క పోటుపొడిచెను. ఇంతలో మెయిలొక స్టేషనులో నాగెను. భీమశంకరరావుగారటదిగి తనకొరకై వేచియుండిన కారునెక్కి యంతర్హితుండయ్యెను.

—*—

## ౧౩

### పేటిక

మలయమారుతము చల్లగవీచుచుండెను. కుక్కుటములు 'క్కొక్కొరోకో!' యని కూయనారంభించినవి. పక్ష్యాదులు తమతమ నెలవులవీడి యాహారార్థ మరుగుదెంచుచున్నవి. కాకులు 'కా! కా!' మని యరచుచున్నవి. అప్పుడే కలకత్తాస్టేషను కొక పాసెంజరువచ్చి నిలచెను. అందుండి జనులందరుదిగి గేటువద్దనున్న టికెట్టుకలెక్టరుగారికి తమటిక్కెట్లనిచ్చి బండ్లపై కొందరును గుర్రపుబగ్గీలపై కొందరును, టాంకార్లపై కొందరును గమ్యస్థానములు జేరుచుండిరి. అందులో నొకబండియం దిద్దరుస్త్రీలుగలరు. బండివెంట నొక పురుషుఁడు నడచుచుండెను. ఆబండి మనకుఁ బరిచయములగు చందుగారింటిముంగలనాగెను. బండిలోనివారుదిగి లోనికిఁ బోయి వగచుచుకూర్చుండిరి. చందుగారును విచారకారణమారసి యావార్త దానివరకు వినియుండకపోవుటచే వారి

కంటె నెక్కువగ నేడ్వజొచ్చెను. వారితోఁగూడ వచ్చిన పురుషుఁడు వారినోదార్చుచుండెను. ఇక్లైదుగంటలగువరకు విచారించి యూరకుండిరి. ఇంతలో చంద్రాననుఁడును వచ్చెను. అంత చందు చంద్రాననులును చందుగారింటికి వచ్చిన పురుషుఁడును చావడిలోనికివచ్చి కుర్చీలపై నాసీనులయ్యిరి. పిమ్మట వారిట్లు ప్రస్తావించిరి.

చంద్రా—చందుగారూ మీ మోమింతుక విచారమును సూపించుచున్నది. కారణ మడుగవచ్చునా!

చందు—చంద్రాననా! తలచుకొనిన దుఃఖము పొంగి పొంగి వచ్చుచుండెను. నాపుత్రుఁడగు వీరసింగు చోరులెవ్వరో యపహరించిరి.

చంద్రా—ఎప్పుడు

చందు—మూఁటు భమును మాయన్న గారింటికనుపునపుడు మార్గమధ్యమున చోరులు మాయన్నగారి యేకైక పుత్రియగుశశి రేఖను నాకుమారుఁడగు వీరసింగును అపహరించిరి. దైవకటాక్షమున శశిరేఖను ఈతఁడు రక్షించెను. వీరసింగు మాత్రి మగుపడుట లేదు.

చంద్రా—ఔట్టా! పాపమూబిడ్డ డెవ్వరికేమి హానిచేసినాడు అయ్యా! ఈ పురుషుఁడెవ్వరు.

చందు—ఈతఁడు మా మేనల్లుడు. ఈతనికేమాశశి రేఖనిచ్చి వివాహ మొనరింప దలచుచుంటిమి. దైవసంఘటన మెటులుండునో చెప్పజాలను.

చంద్రా—బాగుగనే యున్నది.

పిమ్మట వారిద్దరనుబంధితులైన సంగతియునుతప్పిం
చుకొనివచ్చిన సంగతియు దెల్పుకొనిరి. రాజేశ్వరిని రక్షించి
నందులకు చందెంతయు చంద్రాననుని గొనియాడెను. ఇట్లు
వీరుమాట్లాడుకొనుచుండగనే యొకరివెనుక నొకరుగ నేడు
గురుమార్వాడీలు పరుగెత్తుటచే గాబోలు యొగర్చుకొనుచు
వచ్చిరి. వారు చందుగారి కభిముఖులై, బాబు! చందుజీ!
మేము బజారులో నుండి వ్యాపారము చేసికొనుచున్న
మార్వాడీలము నేడు మేమువచ్చి చూచుకొనుసరికి మాయే
డుగురకొట్లను తాళములు తీసివేయబడి యున్నవి. తమరొక
సారి దయచేసి చూడండి! అనుచు దీనులై ప్రార్థించిరి.
చంద్రాననుండతి యాతురతతో చందుగారిని తొందరపెట్ట
సాగెను. చందు చంద్రానన ప్రేమసింగులు మార్వాడీల
వెంబడివారి కొట్లకుబోయిరి. ఆహా! ఆశ్చర్యము. ఏమున్నది.
ఇనుపపెట్టెలు తెరువబడియున్నవి. వానిలో నొకదమ్మిడీయైన
ను లేదుగాని యాగదిలో నొకమూల నేనాణెముల కానాణెములు
వేర్వేరుగ నెంచివేయబడి వేర్వేరుప్రోగులుగ పేర్చబడియున్న
వి. చందుగారా పేర్చబడ్డపైకమును లెక్కించియుండవలసిన
సొమ్మెంత? అని మార్వాడీ నడిగిరి. ఆతడును చిట్టాలనుజూచి
సరిగా చెప్పెను. ఉండవలసినపైకము నున్నపైకముసరిపోవు
నని చెప్పిరి. ఏడుకొట్లలోను నిట్లేయుండెను. చందుగారాశ్చర్య

సంభరితుండై 'మీ యినుపపెట్టల తాళము లెవరివద్దనుంచుకొనిరి' అని యడిగిరి. వారలు 'అయ్యా! మావద్దనే యున్నవని' బదులు చెప్పిరి. సొమ్ముపోనందులకు సంతసింపుఁడని మార్వాడీలను హెచ్చరించి భోజనపువేళ యగుటచే నందరు వెడలిపోయిరి. చంద్రాననుఁడు పదకొండు కాకుండగనే భోజనము చేసివచ్చెను. పిమ్మట చందు చంద్రానన ప్రేమసింగులు నాగభూషణరావుగారింటి కేగిరి. నాగభూషణరావుగారింకను రాలేదనియు నాయన కెట్టి యిక్కట్టు జరుపఁబడనోయనియు విచారించుచున్న శ్యామలాంబగారి నోదార్చి తిరిగి చందుగారింటి కేగిరి. రాజేశ్వరి కూడవచ్చెను. చందుగారు తాను సెట్టిగారిని చూచితిననియు ఆయన జీవించియే యున్నారనియు చెప్పి వచ్చునపుడు వారికిద్వారకు గల్గిన యెడబాటునకెంతయు విచారించెను. పిమ్మట చోరుల ధైర్యసాహసములఁ గూర్చియు వారిని పట్టువెట్టు ప్రయత్నములఁ గూర్చియు నాలోచించుచుండ నొకరక్షకభటుఁడరుదెంచి పోలీసు సూపరింటెండెంటుగారి యనుజ్ఞ దెలిపెను. అంతనందరును పోలీసు స్టేషనుకుఁబోయిరి. చందు చంద్రానన ప్రేమసింగులు సూపరింటెండెంటుగారిచే నియమితస్థానములనలంకరింపఁబడిన పిమ్మట చందుగారుకూడ బంధితులయియుందురని దెల్పిరి. సూపరింటెండెంటుగారు విచారించి సీళ్ళువేసి పంపబడిన రెండు దేవదారు పెట్టెలను జూసి అయ్యవి తనకొకగంటపూర్వము చేరిన

వని చెప్పిరి. అంత చందుగారు 'అయ్యా! సూపరింటెండెంటు గారూ! ఈపెట్టెల మీకెట్లువచ్చినవి' అని యడిగిరి. సూపరింటెండెంటుగారు 'ఇదిగో ఈబండిమనుజుఁడు బండిపై తెచ్చి యిచ్చెనని' యాటనున్న యొకమనుజునిజూపెను. చందుగారు మనుజునివైపై 'ఓయీ! నీకీ పేటికల నెవరిచ్చిరి? అని యడిగిరి. బండివాడు వణకుచు 'ఏమోబాబూ! ఓకోబాబుగారిచ్చారండి మీకిమ్మన్నారండి' అనిచెప్పుచు బండివాడు వెనుకడుగు వేయఁజొచ్చెను. ఇదికనిపెట్టి చందుగారేదియో యనుమానించి రక్షకభటుల కాతనిఁబట్ట యనుజ్ఞ నొసంగెను. రక్షకభటులట్లు గావించిరి. కాని వారిచేతులలో నొక తోలుమాత్రము మిగిలినది. వారిముందొక యువకుఁడుపరిగెడుచుండెను. చంద్రానన ప్రేమసింగు లొక్కుమ్మడి యాతని వెంబడించి బంధించి తెచ్చిరి. రక్షకభటు లాతని శృంఖలాబద్ధునింజేసి జెయిలునందుంచిరి.

చందుగారు పెట్టెను దెరువమనిరి. ముందొక పెట్టె దెరువఁబడెను. తెరచినతోడనే దుర్గంధము బయల్వెడలెను. పరికించి చూచుసరికి అందు బంగారుసెట్టిగారి మృతకళేబరమున్నది. చంద్రాననుఁడు కంటతడిపెట్టెను. రెండవపెట్టెకూడ తెరువబడెను అద్దానినుండి సుగంధము బయల్వెడలెను. అందొక కళేబరమున్నది. అదియొక ఏడెనిమిదేండ్లబాలునిదని మాత్రము తెలియుచున్నది. చందుగారాబాలుని చూచి వప్పటిమండియు దలవని తలంపుగ కన్నీటిబిందువులు జలజల

కాలజొచ్చెను. అప్రయత్నముగ నాతనిహస్తద్వయము బాలునియాలింగనము జేసికొనుటయు నాతడు బారుమని యేడ్చుటయు నొక్కమారుజరిగెను. చంద్రాననుఁ డాయన నూరడించి సంగతి యేమనియడుగ చందుగారు 'ఈతడు నా కుమారుఁడు వీరసింగ' ని చెప్పెను. పిమ్మట చంద్రాననుఁ డొకచేరుమాలునుదీసి వీరసింగు నాసికారంధ్రముల యొద్ద నుంచ యాతఁడటునిటు గదలెను. అందులకందరును సంతసించి బాలు పైకిదీసి యొకబల్లపై పరుండజేసి మత్తునుదొలగించు మరికొన్ని వస్తువులను వాసనజూపిరి. ఒక యరగంటకు వీర సింగు కండ్లుచులుపుకొనుచు నిద్రనుండి లేచినవాని పగిది లేచి చందును గాఢాలింగనము నొనర్చి బారున నేడ్చెను. చందు గారానంద బాష్పములవిడచిరి. చందు పేటికనుండి రెండు త్తరములుదీసి తనకు వ్రాసినదాని నిట్లు చదివెను.

కలకత్తా 16—4—1918

మహారాజశ్రీ పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరు రామ చందుగారికి.

భీమానందుఁ డభివందనములు.

అయ్యా,

మీరు రాజేశ్వరి విషయములో కలుగజేసికొని నందు లకుఁ దగినఫల మనుభవించితిరి. మీరు చీకటికొట్లనుండి తప్పిం చుకొనివచ్చిరిగాని లేకున్న నీపాటికి యమపురి కరిగియుందురు మీరు సెట్టిగారిని తప్పింప యత్నించియు విఫలమనోరథు

నందుల కెంతయు చింతిల్లుచున్నాను, మీకుమారునికై మీ వారుపడు విచారమునకు జాలినొంది విడిచిపుచ్చితిని. సెట్టి గారిని చంపితిని! ఇకమీఁదటనైన నాహితములాలించి నను బట్ట యత్నింపకుందురుగాక-మానకున్న మిమ్మును,మీపుత్ర కళత్రాదులను తప్పక నాశము జేసితీరెదను. నానామము మీరందరెరింగినదేగాన నిజనామముతో సంతకము చేసితిని.

ఇట్లు, మీహితుడు,

భీమానందుఁడు,

రెండవయుత్తరమును సూపరింటెండెంటుగారి కొసం గెను సూపరింటెండెంటుగా రిట్లుచదివిరి.

కలకత్తా 16—4—1918

అయ్యా,

రావుగారినికూడ బంధించితిని. ఇంకనెవ్వరును మిగుల లేదనుకొంటినిగాని ఛందు, చంద్రాననులు తప్పించుకొనిరి. మీప్రయత్నములు మానుడు మనెడీ జాబు, మాలెటరు బాక్సునందు వేయుడు.

ఇట్లు, మీహితుడు

భీమానందుఁడు.

ఈయుత్తరమునుకూడ ముగించినపిమ్మట చంద్రా ననుఁడు 'రావుగారు' తప్పక భూగృహమున నుందురు. వెంటనే పరిశోధనకు గడంగవలయును. నాకంతములోఁ 'ణమున్నంతవరకు నేను భీమానందుని బట్టకమానను'

అని ప్రతిన యొనర్చెను. 'నే నన్నివిధముల చంద్రాననునకు సహాయముగనుందును' అని ప్రేమసింగ నెను. పిమ్మట పోలీసూపరింటెండెంటు గారియొద్ద సెలవుదీసికొని చందు, చంద్రాననపేరిమ, వీరసింగులు సెట్టిగారి మృతకళేబరమునొక బండిపై నెక్కించుకొని చందుగారింటికిఁ బోయిరి. తండ్రిగారి మృతకళేబరమును చూచి పరుగునవచ్చి శవముపైబడి రాజేశ్వరి యేడ్వజొచ్చెను. చందుగారిభార్య యామె నూరడించెను. సెట్టిగారికి దహనసంస్కారాది క్రియలొనర్పబడెను. వీరసింసింగును జూచి రామచందుగారి భార్య యానందాబ్ధి నోలలాడెను.

—*—

## ౧౪
## పాపము పండినది.

నాఁడు వైశాఖశుద్ధదశమి. చంద్రుఁడు గగనమార్గంబున పయనముసాగించుచుండెను. నక్షత్రములుమిన్కుమిన్కు మనుచు మణులభంగిప్రకాశించు చంద్రకాంతి కెంతయువన్నె దెచ్చుచున్నవి. ఆకసమునిర్మేఘమై స్వచ్ఛమై యుండెను. వనమందలి తరుశాఖ లల్లిబిల్లిగ నల్లుకొనియుంటచే చంద్రకాంతిని భూమిపై సోకనీయకుండెను. అచ్చటచ్చటమాత్రము చెట్లయాకులమధ్యనుండి భూమిపైబడిన జంద్రకిరణంబులు గాఢాంధకారమయుంబగు నవ్వనంబున స్ఫటికములవలె ప్రకాశించుచుండెను. రమారమి తొమ్మిదిగంటలయ్యెను.

అట్టితరి నిద్దరు సమవయస్కులగు యువకులు లోడలంతయు రబ్బరుదుస్తులవేసికొని యొకయరణ్య మార్గముఁబట్టి వడివడి పోవుచుండిరి. వారికికొన్ని గజముల దూరమున పోలీసుదళము వెన్నంటుచుండెను. యువకులు టార్చిలైటు సహాయమున మార్గమునసులభముగా బోవుచుండిరి. పోలీసుదళముఁవారిని కలిసికొందమనిగాబోలు పతిరయమునవారికి తగులుగాళ్ళ దెబ్బలకైన లక్ష్యపెట్టక పోవుచుండిరి. యువకులుచాలదవ్వరిగి యొకచోనాగిరి. మరొకసముపములో పోలీసువారు వారిని కలిసికొనిరి. యువకులువారినట పోలీసులుండనియుమించి రెండడుగుల దూరముపోయి యటనున్న యొకరాయిని గట్టిగ కాళ్ళతోఁదన్నిగి. ఆరాయి యొకప్రక్కకు తొలగుటయు నొక్కబిల మేర్పడుటయు జరిగెను. యువకులాబిలముం బ్రవేశించిరి. అందుకొన్ని సోపానములుండెను. వారాసోపానములు దిగి టార్చిలైటు సహాయమున నటనొకతలుపున్నట్లు గ్రహించిరి. తీయుటకనేక ప్రయత్నములుచేసిరిగాని విఫలులయ్యిరి. ప్రాణమువిసిగి యొకయువకుడు గోడకుజేరబడెను. పాపమొక మేకాతని శిరమునకుగ్రుచ్చుకొని బాధగల్గించెను అంత టార్చిలైటు సహాయమున నొకమేకున్నట్లు తెలిసికొని దానినూడబెరికెను. వెంటనే తలుపుతెరువబడి యప్రయత్నుడై సాధనోపాయమాలోచించుచున్న రెండవయువకునకు దగిలెను. తలుపుతెరువబడుటచే వారు వారికి గల్గిన గాయములను సరకుగొనక సంతోషాయత్తచిత్తులై గుమ్మమును

దాటిరి. దాటిన నేమున్నది. వారికెడమవైపున నొకబంగా శాపంవిణి యిల్లు. ఆబంగాళాకెదురుగ శాళీస్థలము శాళీస్థల మున కెడమప్రక్క కొన్నినారసపుకొట్లు. కుడిప్రక్కరాతి చావడి. ఆచావడిలోగూడ కొన్ని కొట్లుండవచ్చును. భాగ్య హామంతయు విద్యుద్దీపములచే దేదీప్యమానంబై విరాజిల్లు చుండెను. మన యువకులు తిన్నగ బంగాళాద్వారము కడ కరిగిరి. ఆతలు పోరగిల వేయబడియుండెను. యువకులు ప్రయాసలేక యే లోన ప్రవేశించగల్గిరి. వీరుపోయిన దొక వసారా ఆవసారాకీ గుమ్మమున కెదురుగనే మరొక గుమ్మ ముండెను. దానితలుపులుగూడ నోరగిలవేయబడి యుంటచే నద్దానిగూడ నతిసులభముగ దాటిరి. దాటగనే యొకహాలు హాలునకిరుప్రక్కల రెండు గదులగలవు. తలుపుబంధించబడి యుండెను. కాని ఒకగదినుండేదియో శబ్దము వినవచ్చు చుండుటచే పొంచివినుచుండిరి.

ఒక—దుర్మార్గులు కృష్ణారావును బంధించిరా?

మరియొక—చిత్తము.

ఒక—బంధించిన వారెవ్వరో తెలియునా?

మరి—చంద్రానన పేరిగసింగులు.

ఒక—పేరిగసింగెవ్వడు?

మరి—చందు మేనల్లుడు నేడే వచ్చినాడు. వెనుక మనము బలిచ్చుటకై తీసికొనివచ్చిన శశిరేఖ మనోహరు డు నాశాభంగము తప్పించినవాడు.

ఒక—సరి. సరి. ఆతని వయస్సెంత?

మరి—చంద్రాననుని వయస్సుండును.

ఒక—సరే. మనము కబుర్లలో కాలము వృథాచేయరాదు. నీవు వేగిరమపోయి కృష్ణునెటులైన విడిపించి మరలయనుమానము లేకుండ నీపోలీసు దుస్తులతో డ్యూటీలో జేరవలయును.

మరి—చిత్తము, సెలవు.

ఈసంభాషణ ముగియుటతోడనే మనయువకులుబయటకుఁబోయి యుచితరీతి తలుపులనుంచి బహిర్ద్వారమును దాటి వెలుపలకుఁబోయి యటనున్న దళమునకేగి యారహస్యమూది కొంత దవ్వరిగి నిశ్చలులై కూర్చుండిరి. మరొక నిమేషముననే యాబిలముగుండా నొకమనుష్యుఁడేతెంచి యొకమార్గముం బట్టి పోవుచుండెను. చాలదూరమేగిన పిదప నల్వురు రక్షకభటులాతనిపైఁబడి శృంఖలాబద్ధుని గావించి కలకత్తాపట్టణమువైపు తీసికొని పోయిరి.

మనయువకులు టార్చ్‌లైటువెలిగించి చేతిగడియారం జూచిరి. అప్పటికిపదిగంటలు దాటుటచే బంగాళాలోమాట్లాడిన వ్యక్తియరిగియుండునని తలంచిమరల బయనమయ్యిరి. పాఠకా! వారెవ్వరో పోల్చుకొనలేవా? ఏమనుచుంటివి? చంద్రానన ప్రేమసింగులనియాఔనునిజమే మనమాయరణ్యమున బడియుంటకంటె చంద్రానన ప్రేమసింగులను వెంబడించుట యుక్తముకదా! ఎందులకనుచుంటివా! భూగృహచిత్రములు దెలిసికొనుటకు, తెలిసినదా, రమ్ము

చంద్రానన ప్రేమసింగులు వెనుకటివలెనే భూగృహ ముం జొచ్చిరి. వారిప్పుడు బంగాళాలోనికిం బోక నారసపు కొట్లవై పున కరిగిరి. కాళీప్రదేశమంతయు కలయదిరిగిరి, కాని యెవ్వరును గానుపింపలేదు. చోరులెటకో పోయియుందురని తలంచి తిరుగ బంగాళాభిముఖులై పోయిరి. బంగాళాప్రవే శించి వసారాగుమ్మములుకడ నిద్దరువ్యక్తులు నిద్రించుచు న్నట్లు తెలిసికొని వారికి మైకముగ్రమ్ముటకొక చేరుమాలును దీసి వాసనచూపి హాలుంబ్రవేశించిరి. హాలున కిరుప్రక్కల గదులున్నవని యీవరకే తెలిపియుంటిమిగదా. చంద్రాన నుఁడు వెనుకసంభాషణ వినిన గదికెదురుగనున్న గదిలోనికి రంధ్రముగుండా చూచెను. ఆగదియందొక దీపముతగ్గించ బడి యుండెను, అందుచే కొలదికాంతితో మాత్రమే ప్రకా శించుచుండెను. ఆగదియందు ఒకమంచమున్నట్లును దానిపై నొక బలిష్ఠకాయుఁడు పరుండియున్నట్లును తెలిసికొనెను. సవ్వడికాకుండ తలుపుదీయు ప్రయత్నములు చేయుచుం డెను. ఆతలుపునకమర్చబడియున్న యిత్తడిగుబ్బనులాగెను, సాధ్యముకాలేదు. నొక్కెను. అదియునంతే చంద్రాననుఁ డాలోచనా మగ్నుఁడైలైటువెలిగించి నల్దిక్కులను దృష్టిని సారించెను. ఆతనిదృష్టి దేనిపైఁ బడెనోకాని కొలదిగ చలిం చెను రెండడుగులు ముందుకువేసెను. తనచేయి పైకెత్తి గోడకు గొట్టబడిన యొకమేకును లాగెను. కాని మేకురా లేదు. గట్టిగ నొక్కెను. తలుపు తెరువబడెను. ప్రేమసింగు

తటాలున లోనికిబోయి మంచముపై బరుండియున్న బలిష్ట కాయుని నాసికారంధ్రములయొద్దనొక చేఁరుమాలునుంచెను. పిమ్మటవారు కాళీస్థలములను జేరిరి. ఇక భూగృహ పరిశోధనకై గడంగ నిశ్చయించుకొనిరి. నారసపు కొట్లవద్దకుఁ బోయిరి. బందిలెవ్వరును లేకపోవుటచే నవి బీగములు వేయబడి యుండలేదు, యువకులు మొదటిగదిం బ్రవేశించిరి. ఆగదియంతయు నాపరాళ్ళచేఁ గప్పబడియుండెను. ఒకచో మాత్రము తెల్లని రాయియుండెను. చంద్రాననుఁడా రాయిపై నిలిచెను. అదికొద్దిగ చలించెను. అందుచేనతఁడు ప్రక్కకువచ్చి దానినితీయనుపాయమాలోచించుచుండెను. ఈలోగా ప్రేమసింగుగది నాల్గుమూలలను పరికించుచుండెను. రెండవ ప్రక్క పరిశీలించుచు గోడపై జేయివైచి పోవుచుండెను. రెండడుగులు బోవుసరికి కాతసచేయి యొకగుబ్బపైఁ బడుటయు భూభాగమందలి తెల్లనిరాయి ప్రక్కకు తొలగుటయు నొక్కమారు జరిగెను. వీరందులకు సంతసించి యామార్గముంబట్టిరి. అదియొక సొరంగమార్గము. వారుకొంతదూరము పోవుసరికొక తలుపు గన్పడెను. వారికిదివరలో రెండుసార్లు మేకులు యనుభవమగుటచే మేకులెటనైన నున్నవేమోయని టార్చిలైటువెల్తురున జూడసాగిరి. అట్లువెదకుటలో చంద్రాననుని కాలికొకగొలుసు తగుల్కొనెను. అతఁడు విడిపించుకొందమని కాలును గట్టిగలాగెను. తోడనే యాతలుపు తెరువబడెను, గొలుసు కాలినుండి విడిపోయెను. వారా

ద్వారమును దాటిరి. అదిమరియొక సొరంగము. వారు కుడి చేతివైపు తిరిగి మరల పయనము సాగించిరి. కొంతసేపటికి బంగారముంగలి కాళీస్థలము చేరిరి. వారు రెండవగదింబ్రవే శించి అందును తెల్లనిరాయి యుండుటగాంచి అదియు మొదటి గదివలెనేయని మిగత రెండింటినిగూడ పరిశీలించిరి. అందును అట్లేయుండుటచే సన్నిగ్గము నొకశే మాదిరని తలంచియారా కారాగారము వీడి బయటకరుదెంచిరి. ఇంతలో రాజేశ్వరి జ్ఞప్తికి వచ్చి చంద్రాననుఁడు ప్రేమసింగూ! మనము రాజేశ్వరి చెప్పినమాట మరచితిమి. ఆనాఁడామె యొద్దకువచ్చిన మార్గ మును జూడవలదా! అనెను. ఔను. చూడవలయునని ప్రేమ సింగనెను. వారుమరల నారసములగదిం బ్రవేశించి రాజే శ్వరి చెప్పినచోప్పున వెనుక చంద్రాననుఁడు బంధింపబడిన గదిం బ్రవేశించెను. ఆగది చూపరులకెంతయు భయము గొల్పుచుండెను. చంద్రాననునికదియను భవసిద్ధమైనదే. చంద్రాననుఁడు టార్చిలైటును వెలిగించెను. వారా గది యందున్న ప్రతివస్తువును జూడగల్గిరి. క్రిందికి జూచిరి. భూభా గమంతయు మట్టిచే మెత్తబడియుండెను. ఇదివరకొకసారి మర్మమెఱిగిన వాడు గావున మరల నామార్గ మేర్పరచెను. అది కాళికాలయము చెంతనున్న బహిర్ద్వారమువరకుబోవుడి సొరంగము కవియుండునని ప్రేమసింగుతోఁ జెప్పెను. ఇది వరకొకసారి పోయినదే మరలబోవుట యాలస్యమని యెంచి వేరొక గదిలోనికిఁ బోవుమార్గమునకై వెదకుచుండెను.

నాల్గుగోడలను పరికించుచుండెను. ఒకగోడకొక చిన్నమీట యుండెను. ఆమీటనొక్కగనే ప్రక్కగోడకు రెండిటికిని రెండు రంధ్రములేర్పడెను. వారొక రంధ్రముగుండా ప్రక్కగదికిబోయి యుండట్టిమీటలు లేకుండుటచే నింకా ప్రక్కగదులు లేవని నిశ్చయించుకొని మరల వెనుకటిగదిజేరి రెండవరంధ్రముగుండా మరొకగదిం బ్రవేశించిరి. ఆగది యందుగూడ నట్టిమీట యుండుటచే దానిసహాయమున మరొక రంధ్రమేర్పరచుకొని యింకొకగదిం బ్రవేశించెను. ఇట్లే మరొక గదింగూడి ప్రవేశించిరి. ఆగదియందట్టిమీట లెవ్వియు లేకుండుటచే నదియే కడపటిగదియని నిశ్చయించి యింకను విచిత్రమార్గము లెవ్వియైన నున్నవేమోయని నల్దిక్కుల పరికించుచుండిరి. ఒకగోడమూల నొక చిన్నమీట యుండెను. ఆమీట నొక్కగనే యొకచిన్న రంధ్రమేర్పడి నీరులోనికి వచ్చుచుండెను. చంద్రాననుడా నీటిని చవిచూచి యవి హుగ్లీనదీ జలంబులని తెలిసికొని నాడు రామచంద్రు గారిని ముంచుటకు వదిలిన నీరీద్వారముననే వచ్చెనని యూహించి దానిని మూసివైచెను. ఆగోడవైపు దృష్టిని సారించెను. ఆగోడ యడుగు భాగమున నొక మీటయుండెను. ఆమీట నొక్కగనే గదినడుమ చతురపుగజము మేరబిల మేర్పడెను. ప్రేమసింగా బిలములోనికిఁబోయెను. చంద్రాననుఁడాతనికిఁ జేయూతనిచ్చి పైకిలాగెను. ఆబిలము గుండా నీరు ప్రవహించుచుండెను. అదికూడ నదీజలంబులని

గ్రహించినాడు తనతో హుగ్లీనదియొద్దున పోరాడి నదిలోనికి దుమికి యంతర్ధానుఁడైన యువకుఁ డీబిలమునుండియే బయట పడెనని యూహించి హుగ్లీనది యటకు సమీపమున నున్నదని తెలిసికొనెను. ఆరంధ్రమునుగూడ మూసివైచి యింకమీట లేమియు గాన్పింపకుండుటచే ప్రేమసింగునకు సారంగమార్గము చూపుదమని సారంగమునకుఁబోవు మార్గము తెరచెను. వారామార్గముగుండాబోయి సారంగము ప్రవేశించిరి. వారు కుడిచేతివైపు దిరిగిపోవుచు ముంజేతి గడి యారమును జూచిరి. అప్పటికి మూఁడున్నర గంటలగుటచే వడివడిగ నడువఁజొచ్చిరి. అట్లు నడచిన సారంగ బహిర్ద్వారముగుండా పైకిబోయి కాళికాలయమువద్ద జోగుచు కూర్చుండియున్న రక్షకభటులను చూచి లోన నేదియో సవ్వడి యగుటచే మరల లోనికిఁబోయిరి. వారికి కుడిప్రక్క నెవ్వరోవచ్చుచున్న ధ్వనియయ్యెను. లైటుసహాయమున నొక ద్వారమున్నట్లు గుర్తెరింగి యటపొంచియుండిరి. చంద్రాననుడు ప్రేమసింగున కెద్దియో చెప్ప నాతఁడు బయటకుఁబోయి బిగిలునిచ్చెను. రక్షకభటులు వచ్చి యాతనిముందు నిలిచిరి. వారినటనుండ నియమించి ఇద్దరు రక్షకభటులను లోనికిఁ దోడ్కొనిపోయెను. మరికొంతసేపటికి ద్వారము తెరువబడెను. ఇంతకుముందే లైటు ఆర్పివేయబడెను. ఆబిలమునుండి యొకరొకరువచ్చుచుండిరి. చంద్రాననుఁడు ద్వారమునొద్దనుండివచ్చినవారి నాసికలయొద్ద నొకచేతిమాలుంచి రక్షకభటుల వశముచేయుచుండెను. దొంగలకు చేతిమాలువాసనచే మాట

రాకుండెను. ఇట్లందరినిబట్టుకొనెను. చంద్రాననుఁడా కెంగార్థులో దొంగీవలకు రాకుండగనే చేరుమాలును వాసనజూపెను. వచ్చు చుండన దొంగది గ్రహించి 'అమ్మో' అని వెనుకకుఁబడెను మిగిలిన దొంగలు తమనెవ్వరో పట్టుకొనుచున్నట్లు గ్రహించి వెనుకకుఁ బారిపోయిరి. చంద్రాననుఁడు పట్టుబడ్డదొంగలను శృంకలాబద్ధుల గావించెను. పిమ్మట నల్వురు రక్షకభటుల తో చంద్రానన ప్రేమసింగులు చోరనాయకుని శయనాగా రము సొచ్చి నిద్రించుచున్న మనుజుని బట్టచూచిరిగాని యాతఁడు మేల్కొని ముష్టియుద్ధమునకు డీకొనెను. కాని అర్థరిలో నొక్కడేమి చేయగలడు అందరు నొక్కుమ్మడి యాతనిపైబడి బంధించి బయటబడిరి. బయటనున్న దళము ను వారిచేపట్టుపడ్డ తనగుంపునచూచి భీమానందుఁడుహతా శుఁడయ్యెను. చంద్రానన ప్రేమసింగులు వీరి నందరను చం దుగారికిఁ జూపి కారాగార బద్ధుల గావించిరి.

—*—

## ౧౫
## ఎత్తు

ఇదేమిచిత్రము! నేడు భాగ్యహామంతయు చిన్నవోయి యున్నది ఎక్కడను మనుజులున్నజాడయైనను గాన్పించుట లేదు. తలుపులన్నియు బార్లెట్టియున్నవి. బహిర్ద్వారములు గూడ తెరువబడి యుండెను. సోదరుఁడగు భీమానందుఁడేడీ! ద్వారపాలకులేరి! పౌరంగమార్గములు డెరచియున్నవేమి.

కారణంబూహింపజాలకుంటిని ఒక్కరాత్రికే ఇట్లమానుష్యంబైనదిగదా? ఎవ్వరైనవచ్చి భీమానందుని యనుచరసమేతముగ పారదోలిరా! లేక పట్టుకొనిరా? అనుచునొకవ్యక్తి భూగృహమంతయు కలయదిరుగుచుండెను. ఇట్లు వెదకుచు భీమానందుని శయనాగారమున కరిగెను. లోపలిగుమ్మము వద్ద నిద్దరువ్యక్తులు పడియుండిరి. వారువిగతజీవులో సజీవులో తెలియుటలేదుగాని యుచ్ఛ్వాస నిశ్వాసలాడుటలేదు. ఇదిచూచి ఖిన్నుఁడై వారిని లేపెను. కానివారులేవలేదు. కంపితచిత్తుఁడై శయనాగారముం బ్రవేశించెను. ప్రవేశించుసరికి ముక్కునకు ఘుప్పున పరిమళముగొట్టుచుండెను. ఏమా! యని చూచుసరికి భీమానందుని శయ్యపై నొక పచ్చనిచేరుమాలుండెను. మనవ్యక్తి యొక్కమారాపరిమళ గంధమును జవిజూచెను. వెంటనే నిశ్చేష్టుడైపడిపోయెను. మరియొకగంటకు లేచి తనవస్త్రములన్నియు రక్తసిక్తములగుటజూచి అయ్యో! నిశ్చేష్టుడనై పడిపోవుచు తలకుఁదగిలిన గాయమునైన దెలిసికొన జాలకపోతినిగదా! నేడెవ్వరి మోము జూచితినో గాని ఖైదునుండి ఎత్తుగాతప్పించుకొని వడివడి వచ్చుచుండ రాళ్ళదెబ్బలు తగిలి కాళ్ళుబ్రద్దలైనవి. భూగృహమునకు వచ్చుసరికి నిటనెవ్వరులేరు. ఇపుడీదెబ్బ తగిలెను. అన్నియు దుశ్శకునములే, నేనుపారబడి యుచితభోజనహోటలునుండి పారిపోయివచ్చితిని జరిగినన్నాళ్ళే జమీందారీ! యన్నట్లు జయిలులోనుండిన తిండిలోపములేదు. ఈబాధలు

రాకుండెనేమి. ఆ! ఏమి నామాటలు! పౌరుషహీనంబులగు మాటలుపల్కుచుంటినే! నాకంఠములో ప్రాణముండగ నా సోదరనాయకుఁడగు భీమానందుని తోడితేవలయు. లేదా ప్రాణత్యాగము చేసికొనవలెను. ఇదియే నానిశ్చితము? అని యనుకొనిచట్టున లేచి దుస్తులనుమార్చి బంగళా దాటుసరికిరువదిమంది చోరులు వచ్చి కృష్ణబాబు! దణ్ణములు. అని ఏకగ్రీవముగ నరచిరి కృష్ణారావు వారిని జరిగిన సంగతి యేమని యడిగెను. అంతవారు 'బాబూ! మేము దొంగతనాని కెళ్లేమండీ తిరిగి కోడికూతేల లోపలికొత్తంటే మాకన్నముం దొచ్చినోళ్ళెవరో పట్టుకొంటన్నారుగా మోరండిమనఎల్లిగాడి ముక్కుకాడేదో సెట్టారటండి. ఈడేడుత్తా యెనక్కుపడితిలోకి ఈడికేకిని ఎనక్కి పారిపోయామండి. మేము జుమ్మా మసీదుకాడ పైకొత్తిలోకి ఓరోఇద్దరు మడుసులు పోలీసోళుకల్సి మనోళ్ళను లాక్కెల్తన్నారుండి చంకెళ్ళేచి, ఆళ్ళెల్లిపోయారు గందా దొరగారుంటారేమోయని మల్లీ వొచ్చామండి' అన్నారు. కృష్ణారావువారితో దొరగారు లేరనిచెప్పి వారి నక్కడనుండ నియమించి బహిర్ద్వారముగుండా నెటకో పోయెను.

## ౧౭
### కృష్ణుఁడేమయ్యెను?

చందుగారు చంద్రానప్రేమసింగులశ్రమకెంతయు సంతసించిరి. పట్టుబడవలసిన చోరులందరును పట్టుబడిరనియునిక కేసువిచారణచేయవలసియున్నదికాన పోలీసుసూపరింటెండెంటుగారి ద్వారా మేజస్ట్రేటుగారికి తెలియపరుప వలెననియు

నిశ్చయించుకొనిరి. ఇంతలో నిద్దరు బాలురు పరుగెత్తుకొనుచు వచ్చి చందుగారికి నమస్కృతులొనర్చి 'అయ్యా! చందు గారూ! ఈ పేపరు చూడండి బాబూ!' అని యొక పేపరు నాయనముందు పడవేసిరి. చంద్రాననుఁడా పేపరు నందుకొని 'వార్తలు' అనియున్న యొక యంశము నిట్లు చదివెను.

నిన్నటి దినమున మద్రాసుకుపోవు మెయిలునుండి యొక శవము నాల్గుగంటలకు నిక్కడ దింపబడెను. వాకబు వల్ల అది కలకత్తావాసులగు ఘోష్ చందుగారిదని తెలియు చున్నది. కాన వారి తాలూకు వారెవ్వరైనవచ్చి యుత్తర క్రియల నొనర్చుకొనవచ్చును.

ఇట్లు

విజయనగరము
16—4—1918

జె. టి. పామర్,
స్టేషను మాష్టరు

అదివిని చందా బాలురతో మీరెవ్వరైన నటకు వెళ్ళి రా అని యడిగెను. ఆబాలురు తామటకు వెళ్ళియుంటి మనియు ఆ శవము తమ తండ్రిదేయనియు నాయనయొద్ద జేబులో పొందుపరుపబడిన నోట్లకట్ట లేదనియు దెలిపిరి. చందు గారు 'సరే! నేను ప్రయత్నించి పొంతకుంబట్టుదును' అని చెప్పి వారు వెడలిపోయిరి. పిమ్మట నీహత్యగావించినదికూడ భీమానందుఁడే యగునని యూహించి మేజస్ట్రేటుగారికి వ్రాయవలసిన సంగతులనుగూర్చి వ్రాయ నుద్యుక్తులైరి.

ఇంతలో నొక కానిస్టిబిల్ వచ్చి దండప్రమాణంబు లాచరించి ముకుళిత వదనుఁడై 'అయ్యా! కృష్ణారావు రాత్రి

యెట్లో తప్పించుకొని పోయెను ' వేసిన తాళములు వేసినట్లే యున్నవి. జెయిలు జవాను వెంకటస్వామి కనబడుటలేదు' అని విన్నవించెను. ఈమాటలువిన్నంతనే యొకరిమొగము లొకరు జూచుకొని యొక్కుమ్మడీ లేచి జయిలున కభిముఖులై పోయిరి. జయిలునుజేరి కృష్ణారావు తప్పించుకొని పోయిన గదియంతయు పరిశోధించిరి కాని జాడలేమియును గన్పింప లేదు. తాళములు జెయిలువార్డెను యొద్దనే యున్నవి. కృష్ణు డని మరల బట్టవలెనని నిశ్చయించి జరిగినసంగతి నంతయు పూసగ్రుచ్చినట్లు వ్రాసి మేజస్ట్రేటుగారికి బంపుటకై సూప రింటెండెంటు గారికి బంపిరి. పిమ్మట చంద్రానన ప్రేమసిం గుల నాలుగంటలకు రమ్మని చెప్పి చందుగారికడ సెలవుదీసి కొని యింటికి పోవుచుండనొక బాణము వారిముందుపడెను. వారా బాణమునుదీసి దానికిం జుట్టబడిన యొక కాగితమునుదీసి యిట్లు చదివిరి.

చందుగారికి— కలకత్తా 17—4—1918

అయ్యా,

ఆనాఁడు సెట్టిగారివీధిలో తమరుంచిన బైసికిళ్ళు రెండును నాయొద్దనున్నవి. నేటిసాయంకాలము నాల్గుగంటల కెవరైనను మాభవనమునకు వచ్చిన మీసైకిళ్ళు బడయ గలరు. నిరాయుధులై మాత్రము రావలెను.

ఇట్లు, కృష్ణారావు.

ఈయుత్తరమును విని ప్రేమసింగుతాను వెడలెదనని

చెప్పెను. చందుగారాతని 'జాగ్రత్తసుమా!' యని హెచ్చరించిరి.

పాపము! చంద్రాననుఁ డింటికిఁబోయి సరిగ కూర్చుండెనో లేదో కాని ముత్యాలరావు ఎఱ్ఱబారిన నయనములతో నిప్పులగ్రక్కుచు కుమారుని చెంతకుఁజని 'చంద్రాననా! నీవేదో నిర్వాకము జేతువ నీకింతవరకు చదువు చెప్పించితిని. నీవుసుంతయు గుర్తెరుంగక నీయిచ్ఛవచ్చినట్లు వేళకుతింక తినక సరిగ యింటికైననురాక తిరుగుచుంటివి. మొన్న దొంగలునిన్ను బంధించితిరట ఎందుచేత? వారితో నీకేమి పని. నీవెవ్వరినో ప్రేమించి యామెకై పలుబాముల పడుచుంటివట. ఎందులకు. అది మానుకొనుము. నీకు మంచి మంచి సంబంధములు వచ్చుచున్నవి. నాయిష్టముచొప్పున మెలంగితివేని నాయింటికిరమ్ము. లేకున్న రావద్దు. అని గద్దించెను. చంద్రాననుఁడు మాటాడకుండ తలవంచుకొని యూరకుండెను. ఇట్లు కొంతసేపు తనయుని దూలనాడి ముత్యాలరావాతని కొక కవరునిచ్చి వెడలిపోయెను. పిమ్మట చంద్రాననుఁ డొకగదిలోనికిఁబోయి యొకకుర్చీపై గూర్చుండి తాఁ జేయుపనులలోని మంచిచెడ్డల విమర్శించుకొనుచుండెను. తుదకు తా జేయుకార్యము తనకొరకేగదాయనియుమున్ముందే తనతండ్రికే తెలియగలదనియు నిశ్చయించి యెప్పుడారు గంటలగునా యని నిరీక్షించుచుండెను.

దమారమి యొంటిగంటయైనది. ముత్యాలరావు నిదురించుచుండెను. అంత చంద్రకొంతమ్మ మెల్లన చంద్రాన

నుని జేరి 'నాయనా, మీనాయనగారు నిన్నెట్లుదూరుచు న్నారో వినుచున్నావా నీవుచేయుపని నాతోనైన దెల్ప వచ్చునా అని యడిగెను.

చంద్రా-అమ్మా, వినుము. ఈయూరిలో బంగారు సెట్టిగారికుమార్తె సూర్యకాంతయినఁట ఆమె నన్నును నేనామెను వలచియున్నారము. వారింట దొంగలు పడిరి. వారిని చాల బాధలకు లోనుగావించుచుండిరి. నేను పోలీసువారికితోడై పనిచేయుచున్నాను. దొంగలనందరను బట్టితిని. ఇక పదునేనుదినములలో కార్యము ముగియగలదు. పిమ్మట నేనామెను పెండ్లియాడెదను. నాకుద్యోగప్రాప్తి కూడ కావచ్చును.

కాం-మంచిది నాయనా! మీనాయనగారికి నేనెట్లో సర్ది చెప్పెదను.

చం—అమ్మా! నేడారుగంటలకు నేనొకచోటునకు బోవలెను. పెందలకడ వంటచేయుము.

కాం—అలాగే నాయనా అని వెళ్ళిపోయెను.

చంద్రాననుఁడు తల్లిమాటలకు చాల సంతసించిధైర్య మవలంబించి ముందుకార్యముచేయు విధానమునుగూర్చి యాలోచించుచు కుర్చీపైననే జేరగిలి పరుండి తనకువచ్చిన యుత్తరమిట్లు చదువుకొనెను.

చంద్రాననా,

నేడు నీవు చోరభవనము పరిశోధింప రాదలంచితివి.

గాని రావలదని హెచ్చరించుచుంటిని. వచ్చిన రావుగారిగతి యే నీగతియగునని యెరుంగుము. ఇట్లు,

కృష్ణారావు.

కార్యసాఫల్యమెట్లుండునో చూతము.

ప్రేమసింగు చోరభవనమునకు వెడలెనో లేదో చూడవలదా పాఠకా! ఏల వెడలక మానును సాయంకాలము నాల్గు గంటలగుసరికి ప్రేమసింగు చోరభవనము జొచ్చెను. అందొక వ్యక్తి తని యుచితాసీనునిగావించి "నన్ను రమ్మనిన కారణ మెఱుంగుదువా" అని యడిగెను. ఏమి! సైకిళ్ళు నెత్తుకొంటిని గదా" అని ప్రేమసింగనెను.

వ్యక్తి—కాదు నిన్ను బంధించుటకు

ప్రేమ—ఇది మోసముగాదా

వ్యక్తి—ఐన నాకేమి

ప్రేమసింగాలసించిన లాభములేదని పిస్తోలును దీసి ఢాం! అని ప్రేల్చెను. కాని ప్రేల్చకముందే యాతఁడొకగదియందు బంధితుఁడయ్యెనని తెలిసికొనెను. ఆహా! చంద్రాననుని సహాయుఁడికనెవ్వరోగదా!

—*—

౧౭

ఎత్తుపై ఎత్తు.

పాఠకా! మనము చిరకాలమైన హుగ్లీనదీతీరమున నున్న చోరభవనమును చూచితిమి. మరల నేడుచూడవలెను

రమ్ము. అది బహుళపక్షమగుటచే నంధచీకటి. అప్పటికి రేడుఘంటలు దాటుటచేఁ జాలచీకటిగ నుండెను. నదినుండి గాలి చల్లగ వీచుచుండెను.

ఆసమయమున చోరభవనములోని గదియందొక యువకుఁడు కూర్చుండియుండి లెటరుబాక్సు లోపలిమూతను తెరచి యుత్తరములేమియు లేకుండుటం జేసి యటనున్న మడత కుర్చీపై నాసీనుఁడై యెద్దియో యాలోచించుచుండెను. అట్లాలోచించుచుండగనే యాతనిదృష్టి యెదుటనున్న పరంజాగూటిపైఁ బడెను. ఏమిచూచెనోగాని దిగ్గున లేచి యొక్కపెట్టున రివాల్వరుతో నావలబడెను. కాని యటనెవ్వరును లేరు. ముందుకు కొంతదూరము నడచెను. ఎవ్వరును గాన్పింపకుండుటం జేసి నల్దిక్కులను జూచుచుండగనే ఢాం! అని యొకతుపాకి ప్రేలెను. తుపాకిదెబ్బ యాతనికి తగులలేదు గాని చుట్టును పొగమాత్రము గ్రమ్మెను. పొగవచ్చుదెస తనగివాల్వరును ప్రేల్చఁబోయెను కాని అందు మందు లేదు. లోనికిఁబోయి మఱియొక పిస్తోలును దేవచ్చి. వెనుదిరుగునంతలో మరల నొక పిస్తోలు ప్రేలెను. తొట్రుపాటుతో నిలుచుండెను. ఇంతలో పొగతగ్గెను. రోడ్డుప్రక్కనున్న యిసుకపై నొక యువకుఁడు నిలుచుండెను. తనరివాల్వరు నెత్తిపట్టుకొని ఆయువకునివైపు పర్వెట్టెను. ఇంతలో వెనుక నుండొక వ్యక్తివచ్చి యాతని రెండుచేతులను బట్టుకొనెను. అంతలో జంకక యాతనితోగూడ మొదటియువకునియొద్దకు

పర్విడుచుండెను. చేతులు పట్టుకొనిన యువకుడు వెనుకకు లాగుచుండెను. అంత నిద్దరు ముష్టియుద్ధమునకు తలకొనిరి. అట్లిద్దరు క్రమముగ నదీజలంబులకడ కరిగిరి. మూడవ పురుషుడు వీరిని వెన్నాడుచుండెను. రెండవవ్యక్తి "మోహనరావూ! త్వరగరమ్ము" అని కేకవైచెను. కొంతసేపటికి మొదటివ్యక్తి యువకునిక్రింద పడద్రోసి దెబ్బకొట్టుటకై రివాల్వరు నెత్తెను. ఇక కొట్టుటయే తడవు. అంతలో వెన్నాడుచుండిన మోహనరావు రివాల్వరును లాగికొనెను. భయాశ్చర్యసంభ్రమములతో మొదటివ్యక్తి పడలో దుమికెను. పడియుండిన యువకుడు గభాలున లేచి విజిల్ నిచ్చెను. వెంటనే పోలీసుదళములు ప్రత్యక్షమయ్యెను. యువకుడు పదిమంది బలిష్టులతోను మోహనరావుతోను యదృశ్యుండాయెను.

రాత్రి తొమ్మిది సమీపించుచుండెను భాగ్యపాము నందలి చీకటికొట్టులలో నొక్కొక్కదానియందు ముగ్గురు వ్యక్తులుండిరి. గానుండి గదికిఁబోవు మార్గములు తెరువబడి యున్నవి. వీరలిజాగరూకులై యుండిరి. ఇంతలో హఠాత్తుగ నొక గదిమధ్య నొక చతురము తెర్చబడెను. మరొక గడియకొక వ్యక్తి తడసిన దేహముతో నందుండి బయటకు వచ్చెను. వచ్చుటతడవుగ ముగ్గురు రాతనపై బడిరి. అందొకడు విజిల్ నిచ్చెను. విజిలియగనే యిరుపార్శ్వములనుండి దొమ్మండుగురు వ్యక్తులు వచ్చిరి. వీరందరును యాతని బంధించి బంగా

ళాముందు కాళీస్థలము జేరిరి. పిమ్మట బహిద్వారముగుండా నీవలబడి కలకత్తాకుబోవు మామూలు మార్గముంబట్టక చుట్టు మార్గముంబట్టిరి. వీరట్లు కొంతదూరముబోయి యటనున్న సెలయేటిని దాటి పోవుచుండ వారికి తుప్పలలో దెల్లనివస్తు వొండుగాన్పించెను. అంత రాజారావా వస్తువునుదీసి యది యొక కాగితమని తెలిసికొని తన జేబునందు పొందుపరచెను. మరికొంతసేపటికి కలకత్తా జేరిరి. పాఠకా! బంధింపబడిన వాడు కృష్ణారావనియు బంధించినవారు, రాజారావు చంద్రాననులనియు తెలిసికొనలేవా! పిమ్మట చంద్రాననుఁడు కృష్ణనితోఁ ఓయీ! నీవు తప్పించుకొనిన యెత్తునకు పైయెత్తు ఇదియని తెలిసికొనుమనుచు యాతనిని చెరసాలలోనుంచెను

అప్పటికిఁ బదకొండు గంటలైనను చంద్రాననునకు నిద్దురవచ్చుటలేదు. అందుచే మరల నతఁడు రాజారావును పురికొల్పి నదీతీరముననున్న చోరభవనముం బ్రవేశించెను. వీరు ప్రవేశించినది యొకగది. ఆగదియందు లెటరుబాక్సులో భాగమును మడతకుర్చీలు డ్రాయరుదక్క తదితరములెవ్వియును లేవు. ఆగదితలుపునకు ప్రక్కగనొకతలుపుమూసి.వేయబడియుండెను. ఆతలుపును తెరువజూచిరిగాని రాలేదు. టార్చిలైటును వెలిగించి చూచుసరికి కొక చిన్నయిత్తడి మేకుగోడకు కొట్టబడియుండెను. వారుదానినిలాగిరి. లాగగనే తలుపు తెరువబడెను. వారాతలుపు దాటిరి. అది మరియొక గది. అందొక పందిరిపట్టెమంచముండెను. దానిపై నెవ్వరును

లేరు. ఒకమూల నిద్దురు మనుజులు పడియుండిరి. తలుపు తెరచిన సవ్వడిని వారు మేల్కనిరి. టార్చిలైటు సహాయమున వారు రావుగారును ప్రేమసింగును అని తెలిసికొని వారిని సమీపించెను. రావుగారు లేచి చంద్రాననా! వచ్చితివా! ఈతడెవ్వరు అని యడిగిరి. చంద్రాననుఁడు నవ్వి రాజారావు అనెను.

రావు—అనగా నెవ్వరు ?

చంద్రా—రాజేశ్వరి. రావుగారాశ్చర్యమునొంది రాజేశ్వరిని కొనియాడిరి. పిమ్మట రావుగారును ప్రేమసింగును రావుగారింటికిఁ బోయిరి.

పిమ్మట రాజేశ్వరీ చంద్రాననులు గదిగోడలకుఁ గొట్టబడిన మేకులన్నియు లాగిరి. కాని ప్రయోజనమేమియు గన్పడలేదు. మంచముక్రిందకుఁ జూచెను. అటనొక గొలుసు కొన కన్పడెను. చంద్రాననుఁడా గొలుసును లాగెను. వెంటనే యొక గుండ్రని సొరంగమార్గ మేర్పడెను. మన వీరులా మార్గముం బట్టిరి. సుమారు మైలునడచుసరికి మరి యొక గొలుసుకొన కన్పడెను. వారాగొలుసును లాగిరి. బహిద్వార మేర్పడెను. వారద్దానిగుండా పైకి వచ్చిరి. అదియు నొకగది. అదిభీమానందుని శయనాగారమని రాజేశ్వరితో జెప్పి గదిపీడి బంగాళాముందు ఖాళీస్థలము ప్రవేశించిరి. అంత నేదో సడియగుటచే నొకచో పొంచినిలుచుండిరి. కొంతసేపటికిపదిమంది చోరులు వచ్చిరి. మనవీరులు బెత్తుగ

బయటకువచ్చిరి. రాజేశ్వరి రివాల్వరును గురిపెట్టి నిలుచుండెను. చంద్రాననుఁడందరను శృంఖలాబద్ధుల గావించెను. రాజేశ్వరీ చంద్రాననులు వీరితో సొరంగమార్గమున కలకత్తాజేరి చోరులను కారాగార బద్ధుల గావించిరి.

---

## ౧౮

### చింతచచ్చినను పులుపుచావదు

మరునాఁడుదయముననే చంద్రానన ప్రేమసింగులు రామచంద్రు గారింటికేగి ఆయనతోఁ గలిసి ఏడుగంటలు కాకుండగనే నాగభూషణరావు గారిల్లు జేరిరి. రావుగారువీరందరను చిత్తాసీనుల గావించిరి. పిదప నందరును కాఫీ యుపమాల సేవించి సిగరెట్లు ద్రావుచు చంద్రానన ప్రేమసింగుల ధైర్యసాహసముల కెంతయు మెచ్చుకొనుచు చేయవలసిన సంగతిని గూర్చి యాలోచించుచుండిరి. ఇంతలో టప్టప్ మను పెట్రోలుశబ్దమును బుర్రు, బుర్రు మను బూరాశబ్దమును వినవచ్చెను. వీరందరు లేచి వీధిలోనికరిగి చూచుసరికొక మోటారుసైకిలు రావుగారింటి ముంగల నాగెను. అందుండియొక దొరగారు దిగిరి. రావుగారాయనకు సేలూట్టుచేసి లోనికిఁ దోడ్కొనిపోయి యొక మడతకుర్చీపై నాసీనునిగావించిరి. పిమ్మట దొంగలు పట్టుబడ్డరీతినిగూర్చియుచ్చటించిరి.దొరగారు చంద్రానును నెంతయు గొనియాడిరి దొరగారి దొంగలనాయకునిజూడ నాశక్తిజనించుటచే నందరు జెయిలునకుఁ బోయిరి. దొంగలనందరరు లెక్కించిమొత్తము

మార్గరున్నట్లు తెలిసికొనిరి. అంత దొరగారు భీమానందుని చెంతకరిగి యాతని భీకరాకృతి కెంతయు నచ్చెరువందిరి. పిమ్మట దొరగారును భీమానందుఁడు నిట్లు ప్రస్తావించిరి.

దొర—నీ పేరేమి.

భీమా—ఎవరైన నేమి?

దొర—నీపేరు నాకుఁగావలయును. నన్నెఱుంగుదువా

భీమా—మిమ్ముల నెఱుగనుగాని మీ వేషమును బట్టి పోలీసు సూపరింటెండెంటుగారుగా గుర్తించితిని.

పోలీసూ—అయిన నీపేరెందులకు జెప్పవు.

భీమా—ఎఱుగుండియు నడిగితిరి గాన చెప్పను.

పోలీసూ—అట్లయిన సరే. నిన్ను మరికొన్ని ప్రశ్న లడుగవలయును. సదుత్తరము లిచ్చెదవా ?

భీమా—నాకుఁ జెప్పవలెనని తోఁచినసరే.

పోలీసూ—ఇపుడుగాకున్న విచారణ సమయమం దైన జెప్పెదవా?

భీమా—ఎప్పటిమాటయో యిప్పుడేల. నేనావిచారణ సమయము వరకిచటనే యుంటినేని నాకు జెప్పవలయునని తోఁచెనేని జెప్పుదునేమో.

పోలీసూ—బాగు! నీపల్కులు బహువిచిత్రములుగ నున్నవే. నాతో నిచ్ఛకములా?

భీమా—కాదు. నిక్కములే.

పోలీసూ—నీవిటనుండ కేటకేగెదవు?

భీమా—నా నివాసమునకు

పోలీసు—ఎట్లు?

భీమా—అడుగనేల? తప్పించుకొని

పోలీసు—అది నీతరమా?

భీమా—కాక?

పోలీసు—ఎవరు తప్పింతురు.

భీమా—నేను చెప్పను. కాని నేజేయు పనులన్నియు చెప్పిచేయుటయే నలవాటు గాన చెప్పుచుంటిని. కృష్ణుఁడు వచ్చి తప్పించును.

పోలీసు—అతఁడీసరికే పట్టుబడియున్న నెట్లు?

భీమా—ఆ! ఏమి! ఎవరు బంధించిరి. అతడు జెయిలు నుండి తప్పించుకొనెనుగదా!

దొర—తప్పించుకొనుటయు మరల నొకయాఁడుదాని చేతిలో జిక్కి మావశంబగుటయు జరిగెను.

భీమా—ఏ యాఁడుది.

దొర—రాజేశ్వరాతని బంధించినది.

భీమా—ఆ!ఆ!ఏమి అట్లయిన శ్రీకృష్ణుఁడే తప్పించును.

పోలీసు—రేపే విచారణయగునెడల నెప్పుడు పారి పోవుదువు.

భీమా—అది నేజెప్పనేల నేటిరాత్రియె.

పోలీసు—సరే చూచెదగాక యని పలికి భోజనపు వేళ యతిక్రమించుటచే నందరును రావుగారింటికేగి యొక కాగితమును వ్రాసిసూపరింటెండెంటుగారిసంతకముతో నద్దాని నొక బంట్రోతున కిచ్చి యాతని నెటకో బంపివేసిరి పిమ్మట

రావుగారి బలవంతముపై నందరును రావుగారింటనే భుజిం చిరి. ''చింత చచ్చినను పులుపు చావదుసుమండీ! యని రావు గారనిరి.

—*—

# ౧౬

## విచారణ.

నాఁడు మే నాల్గవ తేదీ. ఆరవ తేదీనుండే కోర్టులు కట్టి వేయుదురనెడి యాతురతతో సమీపగ్రామస్థులుకూడ వచ్చి తమ తమ చార్జీలను దాఖలు జేయుచుండిరి. ఆనాడే భీమానం దుని కేసుహియరింగు వేయబడెను. ఎండలు మెండుగ గాయు చున్నవి. తక్కువతరగతి టిక్కట్లవారు నాటకముచూచు టకు ఏడుగంటలకేపోయి ముందుకూర్చుండునట్లు నాఁడు మేజ స్ట్రేటుకోర్టునకు జనులు పదిగంటలకే వచ్చికూర్చుండి యుం డిరి. న్యాయవాదులు గుమస్తాలు మున్నగు వారందరు నిర్ణీ తకాలమునకన్న ముందుగనే వచ్చిరి. మేజస్ట్రేటుగారు సరిగ పదకొండుగంటలకువచ్చి యాసన మలంకరించిరి. నాగభూష ణరావుగారు, రామచంద్రుగారు చంద్రానమఁడు ప్రేమసింగు గారందరు మేజస్ట్రేటుగారివెంట వచ్చి యుచితాసీనులైరి.

మరొకబండిపై రావుగారిభార్యయు చందుగారిభార్యయు రాజేశ్వరీ శశిరేఖలును వచ్చియొక ప్రక్కగదిలో గూర్చుండిరి. మేజస్ట్రేటుగారు ప్రాతకేసులను హీరింగువేసిరి. మొదట యనుచరులను తీసికొనివచ్చుట కనుజ్ఞ నొసంగ బడెను. ఒకరివెనుక నొకరిని రక్షకభటులు తీసికొనివచ్చుచుండిరి. అంతలో పోలీసు సూపరెంటెండెంటుగారు కూడవచ్చి వేరొక యాసన మలంకరించిరి. మేజస్ట్రేటుగారు దొంగల స్టేటుమెంటును వ్రాసుకొనుచుండిరి. ఒక్కదొంగయైనను నిజముచెప్పుటలేదు. క్రిమము గ నొంటిగంటయైనది. అనుచరులను వెనుకటివలె బందీకృతుల గావించిరి. పిమ్మట కృష్ణారావును బోను నెక్కించిరి.

డఫేదారు—నీపేరు

కృష్ణా—కృష్ణారావు

డఫే—ఊరు

కృష్ణా—కలకత్తా.

డఫే—వృత్తి.

కృష్ణా—నాకొక వృత్తిలేదు. నాకు దోచినదియే నావృత్తి.

మేజ—కృష్ణారావూ! నీవెందులకు పట్టుబడితివి

కృష్ణా—నాకు తెలియదు. నేను నాగృహమునందుండగ పట్టుకొనుటకై వచ్చిరి. నా దురదృష్టవశమున బట్టుబడితిని.

మేజ——నీవు స్టేటుమెంటు నీయవలయును ఇమ్ము.

కృష్ణా——ఇదిగో వ్రాసికొనుడు.

నేనును ఈ భీమానందుడుపూర్వపు స్నేహితులము. నేదేశాంతరములకరగుటచే మేమిద్దరము వేరుచేయబడితిమి మరల మీరు మిమ్ము బంధించుటంజేసి యిట కలసికొంటిమి నా పేరు కృష్ణుండగుటచే నేను నాజన్మస్థానమునకు వచ్చుటకు సంతసించి కారాగారముదాటక యిటకు వచ్చితిని అంతకన్న నే నింకేమియు నెఱుంగను అని యూరకుండెను. పిమ్మట నాతని యథాస్థానము నందుంచిరి. కృష్ణుని స్టేటుమెంటున కం దరు నచ్చెరు వొందిరి. రక్షకభటులు చోరనాయకుని గొని తెచ్చి బోను నెక్కించిరి.

డఫే——నీ పేరు

చోర——భీమానందుఁడు.

డఫే——ఊరు.

భీమా——కలకత్తా.

డఫే——వృత్తి.

భీమా——మీ రెందులకు బట్టితిరో అదియే నావృత్తి.

మేజ——భీమానందా! నీపై మోపఁబడిన నేరములు రెండు. 1. చోరీ. 2. రెండుహత్యలు. అందుచే నిన్ను బం ధించిరి. నీవిపుఁడు స్టేటుమెంటు నీయవలెను.

పిమ్మట భీమానందు డిట్లు చెప్పదొడంగెను.

"అయ్యా, పెద్దలగు మీయందరకు నావందనములు,

నేను కడు పాపిని. నేజేసిన ఘోరకృత్యంబులఁ జెప్పెద వినుండు. చేసినపాపములు చెప్పినబోవును.

"నేను కలకత్తా నివాసుడను. మాకులమును వాజ్మూలానంతరము చెప్పెదను. నాచిన్నితనమందె నాతలిదండ్రులకు దూరమైతిని. నేనుకొంతకాలమువరకు బుద్ధిమంతుఁడనై మెలంగితిని. కాని సహవాసదోషమువల్లను, నాపినతండ్రి పినతండ్రి యెవ్వరో తరువాత చెప్పెదను. చేయుమన్న బెల్లజేయుటచేతను చోరవృత్తినవలంబించి గొప్పపేరు సంపాదించితిని. నాచిన్ననాటి స్నేహితుండగు కృష్ణుఁడు నన్ననుసరించియే యుండెను. ఒకనాడు నేనును మాకృష్ణుఁడును మరికొందఱనుచరులును సమీపగ్రామములకుఁ బోయి చాలద్రవ్యమపహరించి తిరిగి వచ్చుచుండ యరణ్యమందొకచోట నా కాలికొకఱాయి తగిలెను. నేనద్దానిని ప్రక్కకు ద్రోయించితిని. వెంటనే సోపానము లగుపడినవి. అంత మేమాసోపానముల గుండా లోనికిఁబోయి చూచితిమి. అదియే భూగృహము. మేము తిరిగి బయటకు రాబోవుచుండ మావెనుక నొకడు వచ్చి లోనికిఁ దోడ్కొనిపోయెను. అక్కడసుమారేబదిబంది మనుజులుండిరి. వారి సంభాషణలనుబట్టి వీరుచోరులని గ్రహించి మాగుట్టు వారి కెఱింగించితిమి. అంతవారు మమ్ము కూర్చుండజేసి 'అయ్యా! మా చోరనాయకుఁడు సుబ్బరామయ్యగారు చనిపోయినారు. అప్పటినుండియు ఆయన సంపాదించిన ద్రవ్యమును దినుచు జీవించుచున్నారము. మరల

మీరు మానాయకులుగానుండిన మనమిక్కడనే నివసించి కార్యములు నెఱవేర్చుకొనవచ్చును." అని జెప్పుచు వారు మాకా భూగృహచిత్రములన్నియు జూపిరి. అవి జూచి, వింతనొందితిమి. అప్పటినుండియు మాపినతండ్రి యనుమతి వడసి భూగృహమున నివసించుచు పాడుపడిన గృహమును క్రొత్తదిగా జేసితిమి. విలాసభవనమునకు సమీపముననున్న చోరభవనమునుగాని దానికిని భూగృహమునకు సొరంగము త్రవ్వించితిని. ఇదంతయు నెలరోజులలో బూర్తియయ్యెను.

మాపినతండ్రి తరచు నాతో రాజేశ్వరి సంగతి జెప్పుచుండువాడు. మేము భూగృహముజేరి ఐదేండ్లయ్యెను. ఇన్నినాళ్ళనుండియును గుప్తముగనే వ్యవహరించుచుంటిమి. నేటికి మాపాపము పండినది. రాజేశ్వరి సంగతి విని నప్పటినుండియు నామెను జూడవలెననెడి భ్రాంతి హెచ్చయ్యెను. మరికొన్ని దినములకు నాభవనమునుండియే యామెను జూచితిని. చంద్రాననున కామెయందును ఆమెకు నాతనియందు నమితానురాగమున్నట్లు తెలిసి నయమునజెప్పిన లాభము లేదని ముందు చోరీచేయించితిని. పిమ్మట బంగారుసెట్టిగారిని చెరబట్టించితిని. చందుగారిని కొట్టించి రాజేశ్వరిని రామచంద్రుగారివేషము సంబంధించి వెంటవచ్చిన చంద్రాననునిగూడ బంధించితిని. ఇంతకుఁబూర్వమే మాకృష్ణునకు వివాహము చేయనెంచి చందుగారి యన్నగారికుమార్తెను చెరబట్టితిని కాని అమ్మవారికిఁ బలియిచ్చినగాని మనకార్యములు కొన

సాగవనుటచే నామెను బలియుబోవ నెవరో యామెను దప్పించిరి. ఆమహాత్ముఁ డెటనున్నాడో నానమస్కారములని చెప్పుడు. ఆహా! సహవాసదోషమెంత జే........’ అని యింకేమియో చెప్పబోవుచుండ నొక బాణము రుంయ్ రుంయ్ ధ్వనులతో వచ్చి భీమానందుని కాలికిఁ దగులుటయు నాతఁడు వెనుకకుఁ బడుటయు నొకపరి జరిగెను. ఇట్లు జరుగగనే ఏపనిజేయువారాపని నట్లనేవిడచి యత్యాశ్చర్యముగా జూచుచుండిరి. మేజస్ట్రీటుగారు వ్రాయుచున్న స్టేటుమెంటును విడిచి నాటికి కోర్టుచాలించితిమని చెప్పి భీమానందునకుఁ దగు చికిత్సజేయుటకై యాస్పత్రికి గొంపోనియమించిరి. రక్షకభటు లట్లొనర్చిరి. బాణము వేసినవారెవరో! ఎందులకు వేసిరో! ముందుసంగతేమగునో! పరమేశ్వరునకే యెరుక.

—*—

## ౨౦

శ్రీ శ్రీ

నాటిరాత్రి యంతయు రక్షకభటులు భీమానందున కుపచారములు చేయుచుండిరి. చంద్రాననుఁ డప్పుడప్పుడువచ్చి యాతని సేవ మారయుచుండెను. భీమానందునకు డాక్టరుగారిచ్చిన మందువలన హాయిగ నిద్దురపట్టెను. ఆరాత్రిచంద్రా

ననుఁడు చందు మున్నగు వారందరును రావుగా రింటివద్దనే యుండి భీమానందుని బాణముతోఁ గొట్టిన దెవ్వరై యుందు రో యని యాలోచించుచుండిరి. ఇంతలో నొకరక్షకభటుఁడు వచ్చి నమస్కృతు లొనర్చి యొక కాగితమటమడచి 'అయ్యా ఇది భీమానందునకు దగిలిన బాణమునకు జుట్టబడి యున్నదండి. అని చెప్పి వెడలిపోయెను. అంత చంద్రాననుఁ డద్దాని నిట్లు చదివెను.

పత్తేదారుగారికి,

నమస్కారములు

అయ్యా,

ఈ పరమనీచుఁడు గుట్టును బయటపెట్టుచున్నాడు గాన వీనిని పరలోకమున కనుపుటకై యీ విషపూరిత శరము వేసితిని.

ఇట్లు,

ప్రేరేపకుఁడు.

ఈయుత్తరమును ముగించి 'భీమానందునివలన సకల విషయములు త్వరలో నెఱుంగవలయును. లేకున్న మేజస్ట్రేటుగారు తీర్పు నీయజాలరు. అనుకొని పరుండిరి.

తెల్లవారినది. క్రమముగ పదిగంటలుదాటిపదకొండు గంటలు కావచ్చినది. ప్రొద్దుతోపాటు భీమానందుని బాధయు హెచ్చగుచుండెను. పదకొండుగంటలకు మేజస్ట్రేటుగారు మున్నగు వారందరునువచ్చి యథాస్థానముల నలంకరించిరి.

నాడే కడపటిదినమని కలకత్తాయంతయు మేజస్ట్రేటు కోర్టులో నేయుండెను. పిమ్మట భీమానందుఁడిట్లు చెప్పదొడంగెను. నేను రాజేశ్వరిని వివాహమాడెదనని శుభలేఖలద్వారా తెలియజేసితిని కాని వివాహపువేళ నెవ్వరో పరాత్పరుని భంగి వచ్చి పిస్తోలు ప్రేల్చఁగనే మేమటనుండియే సారంగముగుండా పారిపోతిమి చెప్పమరచితిని. వివాహమునాటి యుదయమున యామెగదికేగి నన్ను పెండ్లాడుమని వేడితిని. ఆమె యియ్యకొనలేదు. అటులైన సెట్టిగారిని చంపెదనంటి, ఎన్నిచేసినను సరే నిన్నుమాత్రము చేబట్టుట కల్లయని స్పష్టముగ పలికినది. నేనదివరకే పిండితో సిద్ధముచేసియుంచిన సెట్టిగారి విగ్రహము తెప్పించి కత్తిచే తెగవేసితిని. అయ్యో! ఆసమయమున రాజేశ్వరి మనస్సెంత బాధకలిగి యుండెనో! నేను సెట్టిగారిని బంధించినది ధనమునకై కాదు. ధనమునకై గ్రహించి బంగారుసెట్టిగారు పరలోకగతులగుదురనియు రాజేశ్వరిని పెండ్లాడవచ్చు ననియు అట్లు చేసితిని. ఆధనము ఒకచో... అయ్యో...బాధ...జీవించను...నన్ను...బాణ....ముతో కొట్టున...ది...అత...డే...యగును...నాయ...ట్టిపాప.. త్ము జెచ్చటి...మందబోడు...కృష్ణా...కృష్ణా..దాహము. అయ్యో....నారాయణ....నాపినతండ్రి....ముత్యాల... రావు...నాపేరు...భీమానం...దుడు...కాడు... రత్నా వను...డు...నారాయణ. అనుచు ప్రాణములు విడిచెను. రత్నాకరుని స్టేటుమెంటు ముగియకుండగనే ముత్యాలరావు

కరస్టు ఆర్డరు (errest order) పంపిరి. రత్నాననుని మృతక ళేబరము బయటపార వేయించి కాఫీకై మేజస్ట్రేటుగారు లేవ బోవుచుండగా నొక యువకుఁడతిరయమున వచ్చి చేతనొక ఖడ్గముబూని నిలిచి యాయాసముతో నిట్లు చెప్పదొడఁగెను.

'అయ్యా! కృష్ణారా వనువాడనునేనే. భీమానందుని సోదర చోరనాయకుఁడను నేనే. చంద్రాననునితో నదీతీర మున బోరాడి నదిలోనికి దుమికి యదృశ్యుడైనది నేనే. చం దుగారిని సైకిలుపై నుండి పడగొట్టునది నేనే. శశిరేఖను బలీ యుగోరినది నేనే. మీయందరకు శుభలేఖలువ్రాయునది నేనే. పిండితో బంగారుశెట్టిగారి విగ్రహముచేసినది నేనే. ఘోషి చందు విజయనగరముపోవుచున్న ట్రైరింగి భీమానందుని పురి కొల్పినది నేనే. మా ర్వాడీకొట్టులలో దమాషా చేసినది నేనే. నా కాకొట్ల తాళము లెట్లువచ్చినవాయని మీారచ్చెరు వందవ చ్చును. ఇదిగో! చూడుడు. నా యొద్దనున్న ఈఎలక్ట్రిక్ టా ర్చిలైటునుజూడుడు. ఎట్టి యభేద్యములగు తాళములకైనను దీనివెల్తురును తగినమాత్రాన విడిపోవును. ఇదిగో!చూడుడని చెప్పుచు నెదుటనున్న తాళముపై పా దీపపువెల్తురును ప్రస రింప జేసెను. వెంటనే యాయుళ మూడిపచ్చెను. 'సెట్టిగారి యింట ఇనుపపెట్టె తాళము దీయుటకిదియే యాధారమైనది. రాజేశ్వరి వివాహసమయమున రత్నాననుని తప్పించినది నేనే. చందుగారు బంగారుసెట్టిగారిని తప్పించి తీసికొనిపోవుచుండ నాటంకపరచినది నేనే. నన్ను బంధించిన పిమ్మట జెయిలు

వానికై నకు వేయిరూపాయలనిచ్చెదనని నమ్మించి బయటకుఁ దీసికొనిపోయి యాతని యమపురికంపినవాఁడను నేనే. రావుగారిని బంధించినది నేనే. మీ సైకిళ్ళు గొంపోయినది నేనే నా పేరు కృష్ణారావు కాదు. సోమసింగు, హేమసింగుగారి-చందుగారి అన్నగారు-వదినెగారి కుమారుఁడను నేనే. చనిపోయితినని మావారికిఁ దెలియపరచి చోరుఁడనై నవాఁడను నేనే. సోదరియగు శశిరేఖను వివాహమాడుట కడు దోషమనియెంచి యామెను బలియకోరినది నేనే. బంగారుశెట్టిగారు చోరభవనమున నుందురు. నేను ఖైదునుండి తప్పించుకొనిభాగ్యహాముననేని నా చోరదశమును గానక నాజీవముండఁగ భీమానందుని తప్పింపవలయుననియు లేకున్న ఆత్మహత్య గావించుకొనవలయుననియు ప్రతిన యొనర్చితిని. ఆప్రతిన నెరవేర్చుకొనుచున్నాను! అనుచు తనచేతనున్న టార్చిలైటును పారవైచి తన కరవాలముచే నాత్మహత్య గావించుకొనెను.

వెంటనే రావుగా రిద్దరు రక్షకభటులను రావించి చోరభవనమునకుఁబోయి సెట్టిగారిని దీసికొనిరమ్మని పంపుచుండ నొకరక్షకభటు డెదురుగవచ్చి 'అయ్యా! నేనుభటుఁడనుకాను. వేషధారినైన బంగారుసెట్టిని నేను చందుగారితో వచ్చుచుండ సోమసింగు నన్నొక గదియందుంచెను. నేను కష్టముతో బయటపడగానే యొక రక్షకభటునిశవము కాన్పించినది. నేనాతని దుస్తులదీసి మూటగట్టుకొని కలత్తా జేరి రక్షకభట వేషమున నిటజేరితిని. బాబూ! ఏదినావరాలమూట!

రాజేశ్వరి అనుచుండగ చంద్రాననుఁడాతని తనచెంత కూర్చుండ జేసెను.

మేజస్ట్రేటుగారు పుల్లిగాడికి, ఎల్లిగాడికి, బుచ్చిగాడికి, వెంకిగాడికి ఆజన్మాంత ద్వీపాంతరవాస శిక్షయు మిగతవారికి మూడుసంవత్సరములు కఠినశిక్షయు విధించిరి. ఇంతలో రక్షకభటులు వచ్చి ముత్యాలరావు లేడని చెప్పిరి. ముత్యాలరావుకనబడలేదని చెప్పుటతోడనే చంద్రాననుఁడు లేచి కన్నీరు గార్చుచు 'అయ్యా! ఈదౌర్జన్య మొనరించినది నాగంద్రియని నేను కలనైన యూహించలేదు. ఈయపవాదు నేభరింపజాల, కాన జీవితమునకు స్వస్తిజెప్పుచున్నాను.' అని యరచి ఒకకత్తి దీసి పొడచుకొనపోయెను. ఇంతలో నొక జవ్వని యటకరుదెంచి 'నాథా మున్ముందా కత్తిని నాకంఠముపైకి రానిమ్ము. ఈకధంతకును గారకురాలను నేను' అని కత్తికి నడ్డుగ నిలువబడెను. అంత చందుగారు లేచి చంద్రాననుని కత్తిని లాగుకొనిరి. రాజేశ్వరి యథాస్థానమునకుఁ బోయెను. చంద్రాననుఁడు బిగ్గరగ 'అయ్యా! నేను రేపు సాయంకాలము లోపల నాతండ్రిని బట్టి మీకొప్పగించనైన నొప్పగించవలెను. లేదా! నేనైన మృతినొందవలెను.' అని తన దృఢ నిశ్చయంబును దెలిపెను. నాటికి కోర్టుచాలింపబడెను.

---*---

# ౨౧

## నీ వే నా ?

చంద్రాననుఁ డందరయొద్దను సెలవుతీసికొని నిజగృహాభిముఖుఁడయ్యెను. రమారమి ఐదుగంట లగుసరికి తనగృహముచేరెను. సింహద్వారమున కేగితలుపుతట్టుచునే 'అమ్మా!' అని పిలిచెను. కాని జవాబురాలేదు మరింత బిగ్గరగ పిలిచెను. కాని జవాబురాలేదు. ప్రాణము లిసుగజొచ్చెను. ఆరుగంటల వరకటనుండినను జవాబురాలేదు. గిరుక్కున వెనుకకుఁ దిరిగెను. ప్రేమసింగు వెనుకనే వచ్చుచుండెను. వారిద్దరు బజారుసందలి యొక హోటలునకుఁబోయి భోజనముచేసి వచ్చి చందుగారింటికిఁ బోయిరి. చంద్రాననుఁ డొకకుర్చీపైఁ గూర్చుండి యిట్లాలోచించుచుండెను. 'మాయింటి తలుపులు వేసి యుండుటకు గారణమేమి. లోన నెవ్వరైన నున్న పిలిచినను పలుకరా! ఎంతసేపు పిలిచితిని! తననెరస్టు ఆర్డరిచ్చిన సంగతి తెలిసి మెల్లైన పారిపోయియుండునా! అట్లే అయియుండును. ఎక్కడకు బోయియుండెను. భూగృహము చోరభవనముననే నెఱింగియున్నావని యాతఁడెరుగును. అందుచే నచ్చోట్లకుఁబోయియుండడు. మరొకస్థలమెచ్చట నుండెను. ఆ! జ్ఞాపకమువచ్చినది. రాజేశ్వరి కపటవివాహపువేళ నేను పిస్తోలుతో నెదుట నిలిచినపిమ్మట భీమానంద కృష్ణులుతప్పించుకొనిపోయినమార్గ ముండియుండును. సరే కనుగొనెదను!

ఆలోచనానంతరము దిగ్గున లేచి ప్రేమసింగును బిల్చి చందుగారియొద్ద సెలవుతీసికొని ప్రేమసింగులతోను మరినల్గురు రక్షకభటులతో నెటకోబోయెను. ఆతఁడు క్రమముగ నేకు న్నర గంటలగుసరికి కాళికాలయముం జేరెను. తాను వెంట తెచ్చిన టార్చిలైటును వెలిగించెను. ఇదివఱకుకొన్ని మీటల కలవడి యున్నవాడగుటచే నట్టి వెచ్చటనైన నున్నవేమో యని వెదకుచుండెను. కాని యేమియు కనపడలేదు అందుచే దేవీవిగ్రహమును స్పృశించి ప్రతి యవయవభాగమును పరి శోధించుచుండెను. ఇట్లు పరిశోధించుచుండగ దలవని తలం పుగ నాతనిచేయి దేవీచేతిపైఁబడుటయు దేవినోరు బలముగ మూరుటయు అందుండి పెద్దనాలుకవంటి రేకుబయటకువచ్చు టయు ఆరేకు మరల చంద్రాననునితోగూడ బిలములోనికిఁ బోవుటయు నొక్కమారు జరిగెను.

పాఠకాగ్రణీ! ఆతఁడుపడినది యొకని బిడాంధకార మగుగది. చంద్రాననుఁడు విద్యుద్దీపమును వెలిగించి నల్దెస లను జూచుచుండ నాతనికొక మీట కన్పడెను. ఆతఁడా మీటనులాగెను. లాగగనే బల్లసోపానులుపైనుండి క్రిందకు జారెను. ఆసోపానముల ప్రక్కగనే యొక బిలముకూడ నేర్పడెను. ప్రేమసింగు రక్షకబటులతో నీసోపానములు దిగి చంద్రాననునిగాంచి యపరిమితానంద భరితుండయ్యెను. పిమ్మట వారందరు సోపానముల ప్రక్క బిలముగుండా బోయిరి. సుమారొకమైలు బోవుసరికొక తలుపుయొద్దకుఁ జేరిరి. వారా తలుపునుగూడ నొకమీటు సహాయమున దెరచి

లోనికిఁబోయిరి. విద్యుద్దీపపు సహాయమున నొకయినుపపెట్టె మాత్రమున్నట్లు గ్రహించి అదియంత పెద్దది గాకుండుటచే తను వారువచ్చిన బిలముగుండా దానిని తీసికొని పోగల్గుట చేతను చంద్రాననుడద్దానిని రక్షకభటులకెత్తి ప్రేమసింగును వారివెంట బంపివేసెను. చంద్రానను డుండిపోవుటకుగల కారణమెరిగియున్న వాడగుటచే ప్రేమసింగు వెడలిపోయెను.

తదనంతరము చంద్రాననుఁడు తండ్రిని వెదకుటకై మార్గమాలోచించుచుండెను. అట్లాలోచించుచుండగనే యప్రయత్నముగ తాళములాడిపోవుట కుపయోగించు దీపమువెల్గెను. అడడా వెలుగుతో నల్దెసల జాడగల్గెను. అతఁడట్లుచేయుగనె యొకమూల 'డడడడ' చప్పుడయ్యెను. ఆచప్పుడేమాయని చంద్రాననుఁడా దెసకరిగి ఒకమార్గమున్నట్లు తెలిసికొనెను. అతఁడా మార్గముం బట్టెను. కొంతదవ్వేగు సరికొక యిల్లు గాన్పించెను. ఆయింటితలుపులు తెరువబడి యుండెను. చంద్రాననుఁడా యిల్లు ప్రవేశించెను. ఆయింట నొక మంచముండెను. ఆమంచముపై నొక యేబదియేండ్ల పురుషుడు నిద్రపోవు చుండెను. తేరి పారచూచి యాతడు ముత్యాలరావేయని స్పష్టపరచుకొని తన జేబునందు పొందుపరచిన సంకెలలుదీసి యాతని శృంఖలా బద్ధుని గావించెను. ఈయలజడికి ముత్యాలరావు మేల్కాంచి తన యెదుటనున్న చంద్రాననుని చూచి తలవంచుకొని నిలుచుండెను.

తండ్రీ! భీమానందుఁ డనుపేరరకాన్ని నన్నుచోర నాయకునిగా చేసినదినీవేనా! నేనువరించిన రాజేశ్వరి నాతనికిఁ

పెండ్లిచేయుదలంచినదినీవేనా! ఒకనాడు నాకుత్తరము వ్రాసి ఎటనుండియో వచ్చినదని చెప్పినది నీవేనా! భీమానందుఁడు పట్టుబడి నిజమును దెల్పుచుండ నాతని బాణముచే గొట్టినది నీవేనా! నీపేరు తెలసిన పిమ్మటనున్న బట్టలేరనిఇఁటికిబీగము వైచి ఇక్కడ దాగినదినీవేనా! నీమూలమున నాపైఁగూడ నధికారుల కనుమానము గల్గునేమొ' అని చంద్రాననుఁడనెను. ముత్యాలరావు కన్నీరుగార్చుచు నిలుచుండెను. పిమ్మట తండ్రికొడుకు లిద్దరును బయనమై తండ్రిచూపిన సొరంగమార్గముంబట్టి భూగృహంజేరిరి. అటనుండి వేరొక సొరంగమార్గముంబట్టి రమారమి రెండుగంటలగుసరికి నిజగృహంబు జొచ్చిరి. చంద్రాననుడు తనతండ్రినట్లుంచియున్న గదులును దెరచి తల్లినిగాంచియేడ్చెను. తల్లియు ముత్యాలరావు నేరముసెరింగి యేడ్చుచు 'నాయనా! నాకువైధవ్యమును దెచ్చిపెట్టితివా!' అనియూరకుండెను ఇట్లుతెల్లవారు వరకు కాలయాపన మొనర్చి చంద్రాననుఁడు తండ్రితో చందుగారింటి కేగెను? ముత్యాలరావు పశ్చాత్తాపముతో నొకప్రక్క నిలుచుండెను.

పదకొండు గంటలైన పిమ్మట చంద్రానన ప్రేమసింగులు తాము తెచ్చిన యినపపెట్టితోను ముత్యాలరావుతోను కోర్టునకు బోయిరి. రామచందులుకూడవచ్చిరి. మేజస్ట్రీటు ముత్యాలరావును స్టేటుమెంటు నిమ్మనిరి. అంత ముత్యాలరావు 'అయ్యా! నేనుదోషినైనమాట వాస్తవము, నాకెట్టి శిక్షవిధించినను విధింపవచ్చును. బద్ధుడను' అనెను.

చంద్రాననుని కోరికపై అజన్మాంత ద్వీపాంతరవాస శిక్ష విధించిరి.

పిమ్మట నినుపపెట్టెదెరచి సెట్టిగారి ద్రవ్యమువగ్గై రాజనాయనకొప్పగించిరి. ఘోష్ చందుగారికుమారులను రావించి యపారమైన సొమ్ములో భీమానందుఁడు మిగిలినసొమ్మున వారికిప్పించిరి. కాని చంద్రాననుఁడా ఖర్చుబడినద్రవ్యమున వలదన్నను వినకతనస్వంత ద్రవ్యమునుండి తీసియిచ్చివేసెను

—*—

౨౨

ఉపసంహారము

పోలీసుసూపరింటెంటుగారు చంద్రాననుని సాహసమునకును వినయవిధేయతలకును చాలసంతోషించిరి. శుభముహూర్తమున రాజేశ్వరీ చంద్రాననులకును, శశిరేఖా ప్రేమసింగులకును మహావైభవముగ సెట్టిగారు ద్రవ్యము వెచ్చించి వివాహమొనర్చిరి. రావుగారు వెంటనే విశ్రాంతిని దీసికొనిరి. చందుగారు డిటెక్టివుగ నియమింపబడిరి. చంద్రాననునకు గవర్నమెంటువారు బంగారుపతకమును ఐదువందలరూప్యములును బహుమతి నొసంగిరి. ప్రేమసింగు సబ్ఇనస్పెక్టరయ్యెను. పైవార్తల కందరును సంతోషాయత్తచిత్తులైరి. మరికొన్నాళ్ళకు రాజేశ్వరి స్కూలుపైనలు ప్యాసయినట్లు తెలిసినది. పాఠకాగ్రణీ! మనముకూడ సంతోషముగ విరమింతము

—*— సర్వము సంపూర్ణము —*—